





# జీవిత చరిత్ర

# లాల్ భహదూర్ శాస్త్రి జీవిత చరిత్ర





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035658

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
| --- | --- | --- | --- | --- | --- | --- |

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# లాల్ బహదూర్ శాస్త్రి

## జీవిత చరిత్ర



అగ్రగామియైన మనద్వితీయ ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారు బీహారు రాష్ట్రమున 1904 సంవత్సరము అక్టోబరు రెండవతేదీన మొగల్‌సరాయిలో జన్మించినారు. గాంధీమహాత్ముని జన్మదినముకూడా అదే. కాని మనభారతదేశంకోసం సర్వస్వం ఒడ్డిన మన పూజ్య ప్రప్రథమ ప్రధాని శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ నవంబరు 14న జన్మించారు, మనమాజీ ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధికూడా అదేనెలలో అవతరించి తండ్రిని మించిన తనయయని తనపరిపాలనా దక్షతవలన మంచిపేరు ప్రఖ్యాతులు గడించుకొంటు న్నారు. అయితే వీరు అగర్భ శ్రీమంతులు. కాని తమ సర్వస్వ మును దేశానికి సమర్పించి మొదటి దశను కోల్పోయారు. అదే తండ్రిబిడ్డలలోనున్న గొప్పవిశేషము.

అయితే గాంధీజీకి శాస్త్రిగారికి అట్టి సామ్యములేదు. కారణ మేమనగా ఉన్నతస్థితినుండే ఔన్నత్యము గడించినవారు మన పూజ్య గాంధీజీ. లేమివలన పరిస్థితులు అనుకూలించక అష్టకష్టా లననుభవించి గాంధీజీ, నెహ్రూలవలె తనువునే దేశంకోసం బలిగా

అర్పించారు మనశాస్త్రిగారు. అట్టి మహానుభావుని జీవితచరిత్రను ఆమూలాగ్రముగా తెలిసికొని వారివలె మన జీవితమును ఆదర్శ ప్రాయముగా చేసికొనుట మనవిద్యుక్త ధర్మము.

## బాల్యము

శాస్త్రిగారు మొగల్‌సరాయిలో శారదాప్రసాద్, రామ్‌దులారీ దేవీ అనే పుణ్యదంపతులకు జన్మించారు. శాస్త్రిగారి తండ్రి చిన్న బడిపంతులు శాస్త్రిగారు పుట్టిన నాలుగోమాసంలో జనవరి 14న హిందువుల విల్లువైన సంక్రాంతి పండుగ. త్రివేణీసంగమంలో జరుగుమేలా ఉత్సవంలో ఆపుణ్యదినాన స్నానాలుచేయుట పుణ్య ముగా భావిస్తారు ప్రతి ఒక్కరూ. ఆమేలా ఉత్సవానికి శాస్త్రిగారి తల్లిదండ్రులిరువురూ వెళ్ళారు. ఆప్రదేశము చూడడానికి నేల యీనినట్లుగాఉంది. ఇసుకవేస్తే రాలకుండాఉంది జనసమూహము.

ఘారుకోటదగ్గర నావమాట్లాడుకొనుట, అందుప్రవేశించుట పెద్దసమస్యగా పరిణమించింది ఎట్టకేలకూ నావ కుదిరిందేకాని అందుకాలుమోపి నిలవడానికే అస్కారము లేకుండా పోయింది, జనం వత్తిడి ఎక్కువైంది. ఆత్రొక్కిసలాటలో శాస్త్రిగారు తల్లి ఒడిలోనుండి జారిపోయారు. అది దైవసంకల్పము. తల్లి, బిడ్డజారి పోయిన సంగతి అప్పటికప్పుడు గమనించలేక పోయింది. తదుపరి ఒళ్ళోబిడ్డలేదు. నిర్ఘాంతపోయింది. ఈ జనములో క్రిందపడినబిడ్డ బ్రతుకటమాయని తల్లి కుప్పకూలిపోయింది. ఆసంఘటన విన్నాక

తం(డ్రి నిర్ఘాంతపోయి బిడ్డను వెతకడం (ప్రారంభించారు. ఇదివిన్న చుట్టుప్రక్కలవాళ్ళుకూడా ఎక్కడ? ఎక్కడ? బిడ్డయని వెదకడం ప్రారంభించారు. కాని బిడ్డజాడ ఎక్కడా కన్పించలేదు. కన్న బిడ్డను చేజేతులా జారవిడచిన తల్లి శోకానికి అవధులులేకుండా పోయాయి.

వీరు ఈ గొడవలోఉండగా మరొక నావ బైలుదేరింది. అందులో పాలవాడు తనబుట్ట తనప్రక్కన ఉంచుకొని చోటులేక మునగడ తీసుకొని కూర్చునియున్నాడు. బుట్టకదిలినట్లనిపించింది. బుట్టకేసి చూశాడు. అందులో చక్కని పసిపాప నిరాక్షేపణీయంగా పాలబుట్టలో కేరింతలాడుతున్నాడు. ఆదృశ్యముచూచి పాలవాడు మురిసిపోయాడు. తనకు బిడ్డలులేరు. తనభార్య గొడ్రాలితనము తనకు గొడ్డలిపెట్టయినది. బిడ్డలులేనిబాధ ఆదంపతులకే తెలియాలి అన్యులు ఊహించలేరు, గ్రహించలేరు, బిడ్డలులేని తల్లిదండ్రులు ఎందుకు ఈ దిక్కుమాలిన బ్రతుకులని జంటగా ఆత్మహత్యలు గావించుకొనేవారిని మనము అక్కడక్కడ చూస్తూనేఉన్నాము. కాని పాలవానిమనసు స్థిమితపడింది. లోలోన మురిసిపోయాడు. దైవము యిప్పటికి నామొర ఆలకించాడు అని ఉప్పొంగిపోయి బిడ్డను ఒళ్ళోకి తీసుకొని తనపైగుడ్డకప్పి ఎంతో పరామర్శించి ఉప్పొంగిపోయాడు.

ఈ జన సందోహంలో తనకీబిడ్డ ఎలా దక్కినాడాయని అందులోని జనం విస్తుపోతు నిజంగా గంగాదేవి అనుగ్రహమేనని తెగపొగిడారు. తల్లిదండ్రులొకప్రక్క విలపిస్తున్నారు. తండ్రి

కాలుగాలినపిల్లిలాగ తిరుగుతున్నాడు. తల్లిమతితప్పి పడిపోయింది గంట సేపటికి పాలవాడున్న నావ ఒడ్డుకొచ్చింది. తండ్రిదృష్టి తటాలున పిల్లవాడిమీద పడింది. గబగబా బిడ్డను సమీపించాడు తన బిడ్డేనని అమాంతము కౌగిలిలోనికి తీసుకొన్నాడు. పాలవాడు లడాయి ప్రారంభించాడు నాబిడ్డంటే నాబిడ్డని వాదం జరిగింది. చుట్టుప్రక్కల జనంమూగారు పిల్లవానిని తల్లిచేతికిచ్చారు వెంటనే తల్లి పాలివ్వడం ప్రారంభించింది. జనంవిస్తుపోయారు ఆ మీదట పాలవానిని దబాయించి వారిబిడ్డను వారికప్పగించారు. పాలవాడు చేసేదిలేక – "చూడండి, నాగుడ్డలన్నీ ఎట్లాతడిపాడో" అనివిచారంగా అన్నాడు అప్పుడు తండ్రిగారు తనఒంటిమీదనున్న 'చాదరు' పాలవాడికికప్పి, పైగా 5 రూపాయలు బహుమతిగా యిచ్చారు. పాలవాడు ఏమేమో కలలు కన్నాడు, కాని దేశానికి పటుతరమైన ప్రధాని కావలసిన ఉక్కుమనిషి తనకుదక్కుటయా? ఆశకు అంతుండాలిగదా! అటువంటి పాలవాడు ఆ బహుమాన ముతో సరిపెట్టుకొని పెన్నిధి పోగొట్టుకొన్నవానివలే యిల్లుచేరాడు. పోయినపెన్నిధి దొరికిన తల్లిదండ్రులు అమితానందముతో స్నానా దులు ముగించుకొని, పిల్లవాడు పెరిగి పెద్దయ్యాక పెండ్లికాగానే దంపతులిద్దరూ 'పియరీ' సమర్పిస్తామని తల్లి మ్రొక్కుకొని అమితానందముతో స్వగృహాన్ని చేరారు ఆపుణ్యదంపతులు,

రాఘునగర్కు గంగకు ఈవలిఒడ్డున, బెనారస్ గంగకు ఆవలి ఒడ్డున, తల్లిగారి పుట్టిల్లు మీర్జాపురము. దురదృష్టవశాత్తు శాస్త్రిగారి తండ్రి తనకు మొదటి సంవత్సరము జరుగకమునుందే కన్నుమూ

శారు తాతగారు యించుమించు అయిదారు మాసములతేడాతో కాలంచేశారు. శాస్త్రిగారు తండ్రిలేనిబిడ్డ అయ్యారు. ఆస్తిపాస్తులంతగాలేవు. తండ్రిగారి అస్తమయముతో కుటుంబ పరిస్థితులు మరీక్షీణించాయి ఆదరించేవారేలేరు. అయినా జీవితము దొర్లించక తప్పదుకదా! చదువు నిమిత్తము శాస్త్రిగారు ఎనిమిదవయేట బెనారస్ చేరారు. తండ్రిలేనిలోటువలన తనవిద్య బంధువులయింట ఉండి కొనసాగించవలసి వచ్చింది. ఆబంధువుకు శాస్త్రిగారంటే అమిత ప్రేమ. ఆప్రేమచేత శాస్త్రిగారిని చదివించే భారం వారిపైపడింది.

## పితృవియోగము

దురదృష్ట వశాత్తు తల్లిపోయిన బిడ్డకు మారుతల్లిచేతిలో సరియైన పెంపకము జరుగదు సంపాయించేది తండ్రి, చేసి అమర్చిపెట్టేది తల్లి. కానిమారుబిడ్డలను కనికరించి ఆదరంగా నూటికికోటికి ఏఒక్కతల్లోతప్ప సామాన్యముగా మారుతల్లి చూడడము చాల అసంభవము. అట్టిస్థితి మన శత్రువుకుకూడా కలుగరాదు. ఇకపరాయివాళ్ళచేతిలో మెలిగేబిడ్డ కష్టాలు వర్ణనాతీతము. తండ్రిలేని శాస్త్రిగారు పరాయివాళ్ళ చేతుల్లో విద్యనభ్యసించవలసిన దురదృష్టము పట్టింది. గత్యంతరములేదు. మొరసారించి జీవితాన్ని లాగడం ప్రారంభించారు శాస్త్రిగారు.

ఆ బంధువు తనకొక యజమానియైనాడు. కానియజమాని మాత్రము శాస్త్రిగారిని బంధువుగానే భావిస్తున్నాడు. ఎందుకంటే బంధువు భార్య శాస్త్రిగారిని ప్రతివిషయంలోను భేదభావముతో

చూడడం ప్రారంభించింది ఇంటిచాకిరీ యావత్తు తనచేత చేయించినా వడ్డనలోకూడా తనబిడ్డలా చూడ్డంలేదు తనబిడ్డలకు వడ్డించే తినుబండారాలు, భోజనమువేరు, శాస్త్రిగారికి వడ్డించే భోజనంవేరు. అంటే వారి భోజనం రాజభోజనం, శాస్త్రిగారి భోజనం పేదభోజనం. అలాగే దుస్తులు మొదలైన ప్రతివిషయాల్లోనూ తేడాచూపడం ప్రారంభించిందా యిల్లాలు. ఈ రాక్షసకృత్యము భర్తకుతెలియదేమో! కనీసము తనపిల్లలు తినే తిండికూడా చూడ నోచుకొనని శాస్త్రిగారు తనకోరచూపులవేడికి తట్టుకోలేక మేడపైకి వెళ్ళేవారు.

అడ్డమైనచాకిరీ తాను చేయక తప్పేదికాదు. కాని శాస్త్రిగారు సహనపరుడు, శాంతి, ఓర్పులనునవి ఆయనకు పెట్టనికోటలు. సహనమే తననంత ఉన్నతస్థితికి నడిపించిందేమో తెలియదు. దైవము ఎందుకో ఒక్కొక్కరికలాంటి కష్టాలు కల్పిస్తూఉంటాడు.

ఒకరోజు ఆ యజమాని బిడ్డకు భయంకరమైన జబ్బుచేసింది ఆరాత్రి కుర్రవానిని వేరేగదిలోవేసి అతనికి పరిచర్యలు చేయమని యజమానిభార్య శాస్త్రిగారికి హుకుంజారీచేసింది. ముక్కుపచ్చలారనిబిడ్డ శాస్త్రిగారికి ఆరాత్రి ఆ సేవతప్పలేదు....వాంతులు, విరేచనాలు. శాస్త్రిగారికి అదిభయంకరమైన కలరావ్యాధియని తెలియదు. ఇంటివారు ఆగదిలోనికివచ్చి ఒక్కరూ త్రొక్కిచూడలేదు పూర్వము కలరాఅంటే హడలిపోయేవారు. ఒకగ్రామములో కలరాఉన్నదని తెలిస్తేమైలుదూరము తొలగిపోయేవారు. అందులో అదిభయంకరమైన అంటువ్యాధి. ఇట్టిపరిస్థితులలో ఆరోగి కళ్ళులోనికిపోయి నాలుకబైటికి వచ్చింది ఆదృశ్యం అతిభయంకరంగా ఉంది తెల్లవారు ఝామును రోగిప్రాణం పోయింది...

శవాన్ని తీసుకువెళ్ళాక ఆరోగి బట్టలుతికేఖారం మనశాస్త్రి గారి పైబడింది. అలాగే అయన కళ్ళనీరు పండ్లకుక్కుకొని తన దైన్యస్థితికి అవురుమంటూ అగుడ్డలు బాగుచేస్తున్నాడు. అసమయంలో తల్లి వెనుకనుండి నిలబడి బిడ్డస్థితి చూచింది. శాస్త్రిగారు తల్లివంకచూచి అవురుమంటూ తల్లి ఒడిలో ఒదిగిపోయారు.

తనబిడ్డ అ రాత్రి అ ఉత్కృష్టవశలో ఉండదానకాబోలు తనకు తనబిడ్డమీద పీడకలరాగా రామ్‌గనర్‌నుండి బెనారస్ వచ్చింది. బిడ్డయొక్క దిక్కుమాలిన పరిస్థితినిచూచి, విని తల్లి తల్లడిల్లి పోయింది. ఆ ఉత్కృష్టపరిస్థితులలో చిక్కుకొనిన బిడ్డస్థితి తల్లిని కలచివేసింది. ఇంత దయనీయమైన పరిస్థితులలో చిక్కుకొనిన బిడ్డ నావిజీవితమునుగూర్చి ఏమని ఊహించాలి?...

ఇంత దౌష్ట్యానికి తలపడిన బంధువులనుగురించి తన కుటుంబమువారు నిందించిన శాస్త్రిగారు ఒప్పుకొనక ఎప్పటికి ఏపరిస్థితులు జరుగుతవో అవి ఆవి అనుభవించక తప్పదు. మన దురదృష్టమునకు ఒకరిని నిందించి లాభమేమని? మన శాస్త్రిగారు తన తల్లికి అక్కచెల్లెంద్రకుచెప్పి సరిపుచ్చుకొనేవారుగాని పల్లెత్తుమాట అనేవారుకారు. అవే ఉత్తమ గుణుల ఉదాత్తభావాలు. ఇన్నికష్టములు అ చిన్ననాడే అనుభవించిన ఆ శాంతమూర్తి ఎంత విశాల స్వభావులో ఈ భయంకర ఘట్టమునుబట్టియే మన మూహించవచ్చును. దైవము తన నిర్ణయానికి ఎవ్వరినీ అడ్డురానీయదు. అది ఆయన సంకల్పము.

మొదటినుండి శాస్త్రిగారు సహనశీలి. ఓర్పు ఆయన ఉగ్గు పాలతో నేర్చుకున్నవిద్య. తనపరిస్థితిని గుర్తుంచుకొని ఎన్ని కష్టాలు కలిగిన సహించేస్వభావం వారిది. తల్లిగారికి శాస్త్రిగారే సర్వస్వము. తనతల్లి ఎంత పేదతనములోనున్నదో బాల్యములోనే అర్థంచేసుకొన్నారు శాస్త్రిగారు ఎవరైనా తమ బంధువులు ఒక పైసా లేక రెండుపైసలిచ్చిన దానిని భద్రంగా దాచిపెట్టుటతప్ప కడుపు కక్కుర్తికోసం ఖర్చుపెట్టేవాడుకాడు. అవి నిలువచేసికొని ఏ పెన్సిలో, పేపరోకొని పొదుపుగా మెలిగేవారు. అంతేగాని తల్లిని చీటికీమాటికీ డబ్బులడిగి బాధపెట్టేవారుకాదు.

ఒకరోజు రామనగరు వెళ్తూ దారిలో ద్రాక్షపళ్ళు అమ్మేదము చూచి పైసాయిచ్చి నాలుగు ద్రాక్షపండ్లు కొన్నారు కొన్నపిదప తనకు ఆలోచనతట్టింది. ఈ నాలుగుపండ్లు ఎవరికని యిచ్చేదని తనలో తాను మధనపడి పండ్లవానిని అవి వాపసుతీసుకొని తనపైసా తనకి ఇమ్మన్నాడు పండ్లవాడు కస్సుమన్నాడు.. పేదవాళ్ళ బేరమంటే బేరగాళ్ళకి ఒళ్ళుమంట. ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతారు అదేమంటే మహాకొన్నావులేపో, నీముఖం నోనేముఖంలాగే ఉందిలేఅని వాళ్ళ యిష్టమొచ్చినట్లు మాట్లాడడంకద్దు. పాపం ఆ పండ్లవాడు ఎలా గైతేనేం నానామాటలని పండ్లు వాపసు తీసుకొని పైసాయిచ్చాడు ఆ పండ్లవాడు తనను నిందగాఆడిన మాటలకు శాస్త్రిగారు ఎంత చిన్నబుచ్చుకొన్నారో అనుభవమున్నవారు ఊహించవచ్చు

# సహవాసదోషము

తాను ఐదవ తరగతి చదువుతున్న రోజుల్లో విభిన్న రుచులుగల స్నేహితులుండేవారు శాస్త్రిగారికి. ఆ విద్యార్థులకు రోజూ దగ్గరలోనున్న జామతోటకు వెళ్ళి దొంగతనంగా కాయలు కోసుకు తినడం అలవాటు. శాస్త్రిగారికి ఈ విషయం తెలియదు. ఒకరోజు స్నేహితులంతా కలసి ఈవిషయం ఆయన చెవినివేసి జామ కాయలకు వెళ్దామన్నారు. శాస్త్రిగారు ఒప్పుకొనలేదు పైపెచ్చు దొంగతనము చేయడము తప్పని ధర్మసూక్తులు చెప్పారు. కాని అలవాటుబడ్డ ప్రాణాలుకదా! అందుకని శాస్త్రిగారిమాటలు ఎక్క రానీయక మనకేం ఫరవాలేదు రమ్మన్నారు. దుష్టజనాంగము ఓటింగు ఎక్కువైనది సహవాసదోషాన వెళ్ళక తప్పిందిగాదు శాస్త్రిగారికి.

శాస్త్రిగారు అందరికంటే బరువు తక్కువకాబోలు అందులో పొట్టిమనిషి కావడాన వాళ్ళ భుజాలమీద ఎక్కించుకొని, తోట గోడమీదుగా ఎక్కించి అవతలికి దించారు. ఇంతలో తోటమాలి పసిగట్టి వాళ్ళపనతేల్చడానికి వచ్చాడు. ఎక్కడివాళ్ళక్కడ పరారు లోపల శాస్త్రిగారు బోనులోని ఎలుకలాగ అలాగే నిలబడిపోయారు కాని తనకొక ధైర్యం. నేను ఎప్పుడూరాలేదు, పైగా నేను కాయలు కోయలేదుగదా! నన్నేమి చేస్తాడని అలాగేనిలబడ్డాడు.

తోటమాలివచ్చి పెటపెటా రెండు లెంపకాయలు వడ్డించాడు నేను కాయలు కోయలేదు, నేనెప్పుడూ యిటువంటిపనులు చేయ

లేదని ఎంతప్రతిమలాడినా విడువలేదు. ఆదెబ్బలకు అదిరిపోయి 'నేను తండ్రిలేనివాడను, నన్ను ఏమీ చేయవద్దు' అని ప్రాధేయ పడ్డాడు. కాని తోటమాలి ఆమాట అందుకొని తండ్రి లేనివాడవైతే ఇంకా జాగ్రత్తగా ఉండాలని మరొక రెండు వడ్డించి వదిలి పెట్టాడు.

చిన్నతనంలో శాస్త్రిగారిని ఎవరైనా బెదిరించినా కొట్టబోయిన ప్రక్కవాళ్ళు వదులు తండ్రిలేనివాడు, ఆపిల్లవాణ్ణి ఏమిచేయవద్దని మందలించి వదిలించేవారు, అదివిని నెమ్మదిగా తానుకూడా నేను తండ్రిలేనివాడినని యిలాంటి ఆపద పరిస్థితులలో అనడం ప్రారంభించారు.

## పేదరికములో పొదుపు

మనశాస్త్రిగారు హరిశ్చంద్ర హైస్కూలులో చదివేరోజులలో నిష్కామేశ్వర ప్రసాద్‌గారు తనక్లాసుటీచరు. మేలాఉత్సవానికి విద్యార్థులనందరిని తీసుకు వెళ్ళాలని ఆయన సంకల్పించారు దానికిగాను తలకొక అణా తెమ్మని ఆర్డరు జారీచేశారు. అందరూ గడువునాటికి సిద్ధపడ్డారు. కాని శాస్త్రిగారు తనవంతువాటా నిష్కామేశ్వరరావుగారి కివ్వలేదు. అందరూ మేలాకు బైలుదేరారు కాని శాస్త్రిగారు బైలుదేరలేదు. కారణమేమని పండిట్‌జీ అడిగారు మేలా చూడవలెనని తనకు ఆశలేదనిచెప్పారు శాస్త్రిగారు పోనీ అణా తెచ్చావా? అని అడగ్గా తెచ్చానని జవాబిచ్చారు శాస్త్రిగారు. అయితే పండిట్‌జీ అంతటితో వదిలిపెట్టలేదు. ఏదీ

నీ అణా చూపించమన్నారు శాస్త్రిగారు జేబులో చేయిపెట్టి ఎంత సేపటికి బైటికె తీయలేదు. తీరా తీసిచూడగా పైసా మాత్రము న్నది. ఎంత ఆత్మాభిమానము గలవాడో నన్నసంగతి పండిట్‌జీకి ఆ సంఘటనతో అర్థమైంది.

మేలానుండి తిరిగి వచ్చినపిదప పనిపెట్టుకొని శాస్త్రిగారిని పండిట్‌జీ యింటికి తీసుకొనివెళ్తూ దారిలో శాస్త్రిజీ దుస్థితిని చెప్పించుకొని జాలిపడి ఇంటికి చేరుకొనగానే తన భార్యను పిలిచి "బాభీ" నీ కొరకు పిల్లవానిని తెచ్చానని చెప్పారు. అదివిని ఆమె పని పిల్లవాడని అంతగా పట్టించుకొనలేదు. కాని పండిట్‌జీ ఆబాలుని తన 'బాభీ' ఒడిలో కూర్చుండబెట్టి ఈ రోజునుండి నీకు నలుగురు బిడ్డలు, ముగ్గురు మాత్రంకాదని ఉల్లాసంగా 'బాభీ' తో చెప్పారు ఇంత ఉదార స్వభావులైన ఉపాధ్యాయులుండబట్టే చాలామంది పేదలు యిలా పైకి రాగలుగుతున్నారు.

ఉత్తమురాలైన ఆ మహాతల్లి భర్తపై రుసరుస లాడక ఆప్యాయంగా ఆబిడ్డను అక్కునచేర్చుకొని కన్నబిడ్డకన్న మిన్నగా చూడ ప్రారంభించింది, అప్పటినుండి శాస్త్రిగారు పండిట్‌జీ బిడ్డల తోపాటు స్కూలు వదలగానే వారి యింటికి రాసాగినాడు. అది గురువుగారి అజ్ఞ. వారి ఆజ్ఞను శిరసావహించక తప్పలేదు. బాభీ తనకు తనబిడ్డలతోపాటు తినుబండారములు పంచిపెట్టేది. బడివున్న రోజులలో బడికి వెళ్ళడం, లేనిరోజులలో యింటి దగ్గరనే ఉండడం శాస్త్రిగారికి తప్పలేదు. అది బాభీ అజ్ఞ. ఇంత ఆదరంగాచూచే ఆ తల్లి ఋణం తీర్చుకోలేననే భావముతో కాబోలు శాస్త్రిగారు

యింటికి రాకుండా ముఖం తప్పించేవాడు. శిష్యుని మనోసంకల్పాన్ని గుర్తించిన గురువుగారు ప్రతిరోజు బడి వదలగానే తన బిడ్డలకు ప్రయివేటు చెప్పమని పని పురమాయించారు. శాస్త్రిగారికి ఈ విషయం మ్రింగుడు పడలేదు. రోజూ రావటం, ప్రయివేటు చెప్పడం తప్పలేదు.

ప్రయివేటు చెప్పినందుకు నెలాఖరునకు ఫలితము ముట్టజెప్పబోగా తమ్ముళ్ళకు, చెల్లాయిలకు చదువు చెప్పినందుకు డబ్బు తీసికోవడమాయని శాస్త్రిగారు నిరాకరించారు. ఇది గుర్తించిన బాభీ ఎత్తుకుపైఎత్తుగా నలుగురు బిడ్డలకు నాలుగు హుండీల నిచ్చింది డబ్బులు పొదుపు చేయమని. శాస్త్రిగారు దొరికిన అణా పైసా అందులో వేయడం ప్రారంభించారు.

కొన్నాళ్ళకు హుండీ పగలుకొట్టి చూడగా శాస్త్రిగారి హుండీలో నోట్లుకూడా వుండేవి. ఇవినేను వేయలేదు, నాకక్కరలేదు అని శాస్త్రిగారు తిరస్కరించేవారు. అయిననూ బాభీ తనపట్టుదలను వదలక, చివరకు ఒక్కసారిగా 900 రూపాయలు కూడబెట్టింది. అదే మరొకరైతే, దాచుకొన్నా తినుబండారములు దొంగతనంగా దిగమ్రింగి చేతికందినవి తస్కరించి ఎరుగనట్లు నటించేవారు. కాని శాస్త్రిగారికి అట్టిలోభి బుద్ధులు అలవడిన మనకు ప్రధాని ఎలా అయ్యేవారు?

ఆ దాచిన ధనము 900 రూపాయలు తల్లిగారి చేతికి అందగా తన అక్క సుందరీదేవిగారి పెండ్లికి ఎంతో సహాయపడి

నవి. ఆ విధంగా తోడ్పడిన గురు గ్రాములను మతాపితలుగా భావించి మురిసిపోయారు శాస్త్రిగారు. అట్టి గురు గ్రాములు ఇప్పటికినీ లోకమున ఎంతోమంది ఉన్నారు. విద్యార్థి తెలివిగల వాడైన ఉపాధ్యాయుని కెంతో ఆనందం. అతనిని బిడ్డ కన్న మిన్నగా భావించడంకద్దు. ఒక్కొక్క హైస్కూలులోని ప్రధానోపాధ్యాయులు యిలాంటి తెలివి నిజాయితి కలిగిన పేదవిధ్యార్థులను చేరదీసి ఫీజులు చెల్లించి పోషించన వారెందరో ఉన్నారు అట్టి కోవకు చెందినవారే ఈ గురు శిష్యులు. నేటి గురుశిష్యులకు వీరు ఆదర్శప్రాయమైన వారని చెప్పకతప్పదు. అందువలన తనను బిడ్డగాచూచిన గురువుగారిని, కన్నతల్లికన్న మిన్నగా సాకిన గురువుగారి భార్య 'బాభి'ని తన జీవితములో మరచిపోలేరనుట అతిశయోక్తి కానేరదు. వారు నిజంగా జీవితము పండిన ఆదర్శ గురు దంపతులు.

## దేశసేవకు నాంది

పూవు పుట్టగనే పరిమళిస్తుందన్నట్లు మన శాస్త్రి అనే పువ్వు తనపరిమళాన్ని లోకానికందించడానికి. కాబోలు విద్యాదశలో నుండి యే దేశ సేవ చేయవలెనని దీక్షవహించి అష్టకష్టాలు పాలైనారు. అదే ఆయన ఆత్మసంతృప్తి, రాజకీయ చదరంగంలో దిగడం అదే ప్రారంభం ఆరోజులలో పరీక్షలు బహిష్కరించమని బాపూజీ ఆజ్ఞ. పిలుపును పురస్కరించుకొని సత్యాగ్రహులు సత్యాగ్రహం ప్రారంభించారు.

హరిశ్చంద్ర కాలేజీ గేటు దగ్గర పరీక్షలు వ్రాయవద్దని కొంతమంది విద్యార్థులు పికెటింగ్ ప్రారంభించారు. శాస్త్రిగారు కూడా ఆరోజు పరీక్ష వ్రాయాలి. గేటుదగ్గరకు వచ్చారు. విద్యార్థులదారి కడ్డముగా పండుకోవటంచూచి వారిని దాటి వెళ్ళడము యిష్టములేక తిరిగి యింటికి వెళ్ళారు. ఆయనతోపాటు తిరిగి వచ్చినవారిలో త్రిభువన నారాయణసింగ్, అల్లూరాయ్‌శాస్త్రి వగైరాలు వున్నారు.

పరీక్షలు వ్రాయకుండా శాస్త్రిగారు రావడం తనకుటుంబ సభ్యుల కెవ్వరికీ యిష్టంలేదు. ఔను సంవత్సరము అంతా తినో తినకో ఫీజులు చెల్లించి తీరా పరీక్షలువ్రాసి ఫలితమనుభవించబోయేసరికి యిటువంటి అవరోధాలు పేదలైన తల్లిదండ్రులకు కంటగింపుగానే ఉంటాయి. కాకపోతే మరేముంది బిడ్డల సౌఖ్యము కొరకు సర్వస్వము త్యాగముచేసి యింతోఅంతో కూడబెట్టి వారి మ్రొక్కు తెల్లారుస్తూ ఉంటారు. తమకు పెట్టకపోయినా వారైనా మేలు పొంది సుఖపడతారని తల్లిదండ్రుల ఆశ. ఇలాంటి బాయికాట్సు కంటగింపు కాకేముంది.

ఆ కాలంవేరు, ఆ త్యాగం వేరు, ఈ రోజుల్లో జాతీయ ప్రభుత్వాన్ని కుంచించడానికి అయినదానికి, కాని దానికి సమ్మెలు చట్టుబండలు. కలిగినవారు యీ సమ్మెలను ప్రోత్సహించడము, అమాయకులు హత్యలకు, కాల్పులకు గురికావడము పరిపాటయింది. ఇత్యాది క్రియలన్నీ పేదలైన తల్లి దండ్రులకు భరింపరాని సంఘటనలు. అయినా ఆ రోజుల్లో పరాయిప్రభుత్వాన్ని పారద్రోలే ఉద్య

మముగాన శాస్త్రిగారు పండిట్‌జీ మాటకూడ నిరాకరించక తప్పి నది కాదు.

*

తరువాత రామనగరువెళ్ళి తల్లిని కలుసుకొని తన నిర్ణ యాన్ని తల్లి కెరిగించారు శాస్త్రిగారు. తల్లి బిడ్డయొక్క ధృఢ వైఖరిని గమనించి తడుముకోకుండా "అడుగు ముందుకువేశావు గాన వెనక్కు వేయవద్దని" గుండెధైర్యం చెప్పగా తల్లిగారి వీర త్వానికి ముగ్ధులైపోయారు శాస్త్రిగారు. తన జీవితములో తల్లిమాటనే శిరసావహించి చివరకు మహోన్నతశిఖరాలను అందుకోగలిగారు. పట్టుదలకు ఆయనకు ఆయనేసాటి. నీతిలో ఆయన్నిమించినవారు చాల అరుదు ఇట్టి శాస్త్రిగారు తల్లిగారి ప్రబోధముతో తన జీవి తాన్ని పరిపక్వాన్ని గావించుకొన్నారు చిట్టచివరకు.

తరువాత కాశీ విద్యాపీఠములో చదువు ప్రారంభించారు. ఖద్దరు దుకాణములో పనిచేయుచూ వేతనము గడించి ఆ వేతనములో కొంతమాత్రమే తన ఖర్చుల క్రింద మిగుల్చుకొని మిగతాదంతా తల్లిగారికి పంపించేవారు. ఆ విధంగా జీతాన్ని పొదుపుగా వాడు కొంటూ ఇటువిద్య, అటు భుక్తి గడిచేటట్లు పాటుబడి కొంత ధనం కూడబెట్టి యిద్దరు సోదరీమణుల వివాహము లోటులేకుండా జరిపిం చారు. తానొక యింటివాడు కాకముందే శాస్త్రిగారు సంసారములోని సాధకబాధకాలను సాకల్యముగా ఆకలింపు చేసికొని ఆదర్శ ప్రాయంగా విద్య నభ్యసించారు.

# దైవ సంకల్పము

రోజులుగడిచేకొలది శాస్త్రిగారికి యుక్తవయస్సు వచ్చింది. ఈడువచ్చినవారికి తోడు తోడుచేయాలి. గుణవతియైన భార్య కావాలని ప్రతిఒక్కరూ కోరుకుంటారు. అలాగే గుణవంతుడైన భర్త కావాలని ప్రతి స్త్రీ కోరుకుంటుంది. కాని ఎన్ని తిథులూ, నక్షత్రాలు, జన్మఫలితాలు తిరగవేసినా దైవము ఎవరికి ఎవరిని తోడుచేయాలో వారినే జతకుదుర్చుతూ ఉంటాడు.

మీర్జాపురం పట్టణములో చేత్‌గంజ్ మొహల్లాలో గణేశ్ ప్రసాద్, కౌసల్యాదేవనే ఆదర్శదంపతులు నివశిస్తున్నారు. వారి యింటిపేరు 'లాల్‌వనీ'వారు. చూనార్‌జిల్లాలో పనిచేస్తూ ఉండే వారు. తరువాత బెనారస్‌కు బదిలీ అయినారు. వీరు దసరా, హోలీ లాంటి పెద్దపండుగలకే యింటికి వచ్చేవారు.

అయితే గణేశ్‌ప్రసాద్ చాలా జాలిపరులు. పేదలంటే చాలాజాలి ఒలకపోస్తారు. పేదలు కంటికి కనిపిస్తే చేతిలోఉన్నది ఎంతోకొంత యిస్తేనేగాని వారికి తృప్తి ఉండదు. అలాంటి ధర్మపరుడు గణేశ్‌ప్రసాద్. పండుగలకి యింటికి రాగానే బిడ్డలనందరినీ వెంటబెట్టుకొని మొహల్లా వెళ్ళేవారు. వెళ్ళిన తరువాత తమ చుట్టు ప్రక్కల నివసిస్తూఉన్న చాకళ్ళు, మంగళ్ళ యిండ్లకువెళ్ళి పేదలైన వారి స్థితిగతులు తెలిసికొని శక్తికొలది పండుగలకు తగినంత ధర్మము చేసేవారు మరీ పేదలైన వారికి తానుకొని వెంటబెట్టుకొని పోయిన నూతన వస్త్రాలు పంచిపెట్టేవారు. మనం పేదవారికి పైసా ధర్మము చేయాలంటే మనసుకుదరాలి. చిల్లర

ఉండాలి. మనసు కుదిరితే చిల్లర మార్చి అయినా యిస్తాము. కొంతమందైతే కొంచం మొండిగా నిలబడి అడిగేవాణ్ణి విదిలించి కొడతారు, అయితే గణేశ్ ప్రసాద్ పుట్టుకతోనే దానగుణులు. వారికి దానధర్మాలు చేసి యింటికిరాగానే భార్య ఊరుకునేదికాదు. అన్ని వివరాలు అడిగి నచ్చని ధర్మాలకు పిచ్చిగా ఎగిరిపడేది. అయినా కౌసల్యాదేవిగారి మాటలు గణేశ్ ప్రసాద్ అంతగా పట్టించుకొనేవారుకారు.

అట్టి దానకర్ణుని కడుగూటిబిడ్డే శ్రీమతి లలితాశాస్త్రి. వీరి తండ్రి ఆరోఏట బళ్ళో విద్యాభ్యాసము కోసం చేర్చారు. సంవత్సరము తిరక్కముందే తండ్రి కాలంచేసారు. మంచిపూవులను తోటమాలి త్రుంచినట్లు దేవుడు మంచివారిని త్వరలో పిల్చుకుంటాడు. తండ్రి మరణంతో తల్లి నిష్పృహచెంది ఆడపిల్లల చదువు అచ్చిరాలేదని బడిమాన్పించారు. ఇక చేసేదిలేక లలితాదేవిగారు యింటివద్దే కొద్దికొద్దిగా చదువు నేర్చుకొన్నారు. తల్లిదండ్రుల అలవాట్లు బిడ్డలకు తప్పవనేది లలితాదేవిగారిలో ఋజువయినాయి. తండ్రివలే తానుకూడా తమయింటి ప్రక్కనున్న పేదలైన చాకళ్ళు, మంగళ్ళకు సహాయం చేసేది. వారు ప్రతిదినమూ పస్తుల్లుండడం తన మనస్సు సహించక బియ్యము, పిండి పొట్లాలు కట్టి చాటుగాయిచ్చేది. సోదరులు సంపాదిస్తూ ఉండేవారు. అందువల్ల తనకెట్టిలోటు కలిగేదికాదు. ఒకసారి ప్రక్కవాళ్ళకు పొట్లాలు కట్టి యివ్వడంలో తల్లిగారికి ఆమె పట్టుబడింది. మధ్య తరగతి కుటుంబీకులకు తలకు మించిన దానధర్మాలు దారంగదా! అందు

వలన తల్లి ఆమెను మందలించింది. అయినా ఆఅలవాటు లలితమ్మ మార్చుకోలేదు. అంతా ఆమెమీద కన్ను వేసిఉంచారు వదినలతోసహా, మరలా యింకొకసారి తల్లిగారికి పట్టుబడింది తను తల్లికి విసుగుపుట్టి యింట్లోపెట్టి గొళ్లెం పెట్టింది. కాని ఆమె తీసే వరకూ ఏడ్చి గోలచేసింది. చివరకు తల్లికే విసుగువేసి వదలి వేసింది.

ధర్మంచేసే చేయి దాచినా దాగదట. ఒకరోజు వాళ్ళయింటి ప్రక్కనున్న మంగలి చనిపోయాడు. కుటుంబము చాలా పెద్దది అదిగాక వాళ్ళు చాలా పేదవారు పెద్దబిడ్డకు పదేళ్ళవయస్సు. వారికి దినం గడిస్తే తనం గడిచినట్లుండేది. ఆ పేద స్థితికి చకితు లైన ఆ పేట సాటి కులస్తులు తాము సంపాయించిన ఒక్కరోజు సంపాదన ఆ కుటుంబానికి యివ్వ నిశ్చయించి అలాయిచ్చి ఆదు కొన్నారు. అయినా ఆకుంటుంబం నెలలో చాలారోజులు పస్తులుం దేది. వాళ్ళయిల్లు వీరి యింటి ప్రక్కనే కొంచము ఎత్తుతక్కువగా ఉండడం వల్ల యింట్లోకి లలితాదేవి లాంటివారు పొట్లాలు విసిరి వేసేవారు ఒకసారి లలితాదేవి తల్లికి పట్టుబడింది. అయినా కడుగూటి బిడ్డ కావడాన తల్లి ఆమెను ప్రేమతో చూచేది. సోద రులు కూడా అంతే తానుకూడ లేనివానిని కావాలని హరం చేసేది కాదు. చీరెలు వగైరాలు సమిష్టిగా తెస్తే తన వంతు ఏదివస్తే అదే తీసుకొని తృప్తిపడేది. ఆమెలో తండ్రిగారి మహత్తర దయాదాక్షిణ్య లక్షణాలు యీ విధంగా పనిచేశాయి, ప్రతిబిం బించాయి.

# పెండ్లి చూపులు

శాస్త్రిగారి పినతల్లి పీరిముహల్లాకు దగ్గరలోనున్న గణేశ్ గంజ్‌లో ఉండేవారు. పినతల్లిగారియింటికి శాస్త్రిగారి తల్లి వచ్చి నప్పుడల్లా చేత్‌గంజ్‌కూడ వస్తూవుండేవారు. ఆమెస్వభావం మధు రంగా ఉండటంవలన ఆ పేటలోనివారంతా ఆమెఅంటే అభిమానంగా ఉండేవారు. వారి పినతల్లి బంధుత్వాన్నిబట్టి సోదరికావడంవలన ఆమెను అందరూ దుల్లర్‌బహన్ (రామ్‌దులారీ) అని పిలిచేవారు.

ఒకరోజు వారి ప్రక్కయింట్లో ఒకరు చనిపోయారు. వారి యింటికి లలితాదేవిగారితల్లి వెళ్తూ ఎవ్వరూ అక్కడకు రావద్దని ఆజ్ఞాపించి పోయింది. అయితే తల్లిని ముందు పోనిచ్చి తరువాత అందరూ చేరుకొన్నారు. ప్రక్కయింట్లోవుండి అందరూ చూడడం ప్రారంభించారు. వారు మృత్యువునుచూడడం అదే మొదటిసారి. వారంతా విషణ్ణహృదయాలతో ఉన్నారు.

అరోజు తల్లితోబాటు శాస్త్రిగారుకూడ అ యింటికి వచ్చారు. లలితాదేవిగారు శాస్త్రిగారినిచూడడం అదే మొదటిసారి. అప్పటికి అమెకు పదకొండోఏడు. అంతా ఏడుస్తున్నారు. శాస్త్రిగార్లు మవు నంగా ఒకవైపున నిలబడిఉన్నారు. అంతా ఏడుస్తున్నారుకాని, లలితాదేవిగారు, శాస్త్రిగారు కంట తడిపెట్టడంలేదు. అలాంటి శాస్త్రి గారితోసే కొంతకాలానికి లలితాదేవిగారికి వివాహము జరిగింది.

లలితాదేవిగారి తల్లికి శాస్త్రిగారు నచ్చారు. వారి పెద్దఅక్క వివాహం ప్రసక్తి ముందు వచ్చింది. అయితే శాస్త్రిగారి తల్లి

వివాహానికి అంగీకరించలేదు. వారి అక్క వివాహం వేరొకచోట జరిగింది. తరువాత రెండు సంవత్సరాలకు లలితాదేవి వివాహ ప్రసక్తి వచ్చింది. వియ్యపురాండ్రిద్దరూ అంగీకారానికి వచ్చారు. లలితాదేవితల్లి ఈ ప్రస్తావన తన కుమారునితో సంప్రదించింది. కాని పెండ్లంటే నూరేళ్ళపంట. మనము జాగ్రత్తగా ఆలోచించి చేయాలి, తొందరపడవద్దని కుమారుడు తల్లిని హెచ్చరించాడు. కాని కుమారునికి మూడు మంచి సంబంధాలు తగిలాయట. వాటి మీద దృష్టితో లలితాదేవి అన్నగారు ఆమె తల్లిగారికి అలా సలహాయిచ్చాడు.

ఆరాత్రి లలితాదేవిగారు ఒక విచిత్రమైన కలగన్నది. ఒక దేవాలయంలోనికి పూజకోసం వెళ్ళినదట. తన చేతిలో ఒక పూల దండ ఉన్నది. తాను లోపలికి ప్రవేశించగానే శాస్త్రిగారు దేవాలయములోనుండి బైటకువచ్చి ఆగారట. తానుకూడ ఆగి శాస్త్రిగారికి మెడలో పూలదండ వేసిందట. దానికి ప్రతిగా శాస్త్రిగారు ఒక పుష్పగుచ్ఛాన్ని యిచ్చారట. అప్పుడు వారి ఆనందానికి మేరలేదు. ఇంతలో మెళకువవచ్చి త్రుళ్ళిపడి లేచిందట. పరిశీలిస్తే అంతా కల. ఇక తనకు ఆ రాత్రి నిద్రపట్టలేదట.

నిజంగా స్త్రీకి గాని పురుషునికిగాని మనసు కుదిరితే ఎన్ని కలలు కంటారో ఎంత త్యాగము చేస్తారో చెప్పలేము. లలితాదేవి గారికి అదేధ్యాస, అదేధ్యానం. కాని తన అన్నయ్య మాత్రం పెడదారులు త్రొక్కడం తనకు బాధ అనిపించింది.

తాను ఆ పరిస్థితులలో నిస్సహాయురాలై తాను చిన్ననాటి నుండి కొలుచు సాలిగ్రాంని తన ధ్యానములో నిగ్గదీసింది. ఎంత పట్టుదలలో చెప్పడానికి తన యిష్టదైవాన్ని ఎంతగానో ఆరాధించింది అర్థించింది. కానీ నోరులేని బొమ్మ. విశ్వాసం అలాంటిది. తన యిష్టదైవంకూడా తనకు అంకెకు రాలేదని వ్యవహారము బెడిసి నప్పుడల్లా సాలి గ్రామమును నీళ్ళలో ముంచేది. నీవునాకు శాస్త్రి గారిని కాకుండా ముంచుతున్నావు కాబట్టి నిన్ను నేను ముంచు తున్నానని ఆమె భావన.

అన్నయ్య వరాన్వేషణకు బైల్దేరగానే సాలిగ్రాం తన మొర వినలేదని ఊపిరాడకుండా నీళ్ళలో ముంచేది. ఆ సంబంధము తప్పిపోయిందనగానే సాలిగ్రామును నీళ్ళలోనుంచి బైటకు తీసేది. ఒకరోజు బెనారస్‌లో మంచి సంబంధముంది, కట్నాలు, కానుకలూ అన్నీ ముగిశాయి కాని వరుణ్ణి చూడాలని బెనారస్‌కు అన్నయ్య బైలుదేరాడట. ఆ మాట వినగానే సాలిగ్రాముకు మళ్ళీ తిప్పలు వచ్చి నీళ్ళలో ముంచింది. ఆ వ్యవహారానికి వెళ్ళి చూడగా వరుడు నచ్చలేదట అందువలన తిరిగివచ్చి తల్లితో చెప్పాడు. ఇక సాలీ గ్రాముకు బందీ విడుదల. ఎట్టకేలకు వారి అన్నయ్య శాస్త్రిగారితో వియ్యానికి ఇచ్చగించారు. ఇలా రెండు సంవత్సరా లకు వ్యవహారం ముడిపడింది. లలితాదేవి రొట్టె విరిగి నేతిలో పడింది. పెళ్ళి నిశ్చయమయింది. వరదక్షిణగా ఒకరూపాయి ఒక తాను గుడ్డ, పండ్లు, పసుపు పుచ్చుకొన్నారు.

వివాహానికి పూర్వము ఈ సంబంధము గురించి తనతో ఒక్కసారైనా తల్లిగారు సంప్రదించ లేదని శాస్త్రిగారు అన్నారట లగ్నం మే 16న ఖాయంచేసారు.

## వి వా హ ము

పెండ్లివారు మే 15వతేదీనాటికి చేత్‌గంజ్ చేరారు. పండితులు వివాహం జరిపించడానికి ఆయత్తమయ్యారు. శాస్త్రిగారు పెండ్లిప్రతిజ్ఞ మేమే స్వయంగా చేస్తామన్నారు. విద్యావంతులు కొన్ని మూఢనమ్మకాలను, సనాతన ధర్మాలను వ్యతిరేకిస్తే మండి పడేవారు ఆనాటి పెద్దలు వీరు ఆచారాలను మంటగలుపుతున్నారని వాళ్ళ కడుపుమంట. విద్య వికసించినతరువాత ఎన్నో మార్పులు విజ్ఞానులు ప్రవేశపెట్టారు. విద్యావంతుడైన శాస్త్రిగారు వెలిబుచ్చిన భావము పెద్దలకు గొంతున పచ్చి వెలక్కాయ పడినట్లయినది. అందులో అప్పుడు మరీ మూఢనమ్మకాలు ఎక్కువ.

ఇదేం విపరీతమని అమ్మలక్కలు మూతులు విరిచారు. ఎంత చదువుకుంటేమాత్రం ఆచారాలు తోసివేయడమా? "పదండి, పదండి సంబడంగానే ఉంది ఈ పెండ్లి" అని గొడవపెట్టారు. శాస్త్రిగారు తన పట్టుదల వదలలేదు. బుద్ధిమంతులైన పెద్దలు తన పక్షం వహించి శాస్త్రిగారిమాటను బలపరిచారు. ఆ మాత్రంప్రతిజ్ఞ మేము చేయకపోతే యింకా పెండ్లేమిటి? అని విస్తుపోయారు. నిజంగా పురోహితుడు తెలియనిభాషలో పలికే ప్రమాణాలు అందరికీ తెలియవుగదా! చివరికి వ్యవహారం ఒక కొలిక్కివచ్చింది.

శాస్త్రిగారి మాటప్రకారమే పెండ్లిజరిపించారు పండితులు. ఆయన పంతం నెగ్గింది.

వివాహాది కార్యాలలో కొన్నికొన్ని అనర్ధకాలు జరగడం కద్దు. అది దురదృష్టవంతుల దుస్థితి- పెండ్లివైభవం సవ్యంగా అనుభవించడం అందరికీ దక్కదు. పెండ్లండే ఏదోకీడు జరగడం మనం చూస్తూనేఉంటాము. పెళ్ళివారిపడవ మునిగిందనో, పెళ్ళి వారిబస్సు బోల్తాకొట్టిందనో, ఎవరో పోయారనో అపశకునాలు జరుగుతూఉంటాయి. కాని అంత ఘోరము జరిగిందని కాదుగాని లలితాదేవి పెండ్లిపీటమీద కూర్చున్నది. అసలీపెండ్లి వేసవిలో జరగడము పెండ్లిబట్టలతో ఊపిరాడని స్థితి. పీటమీద ఉండగనే కందిరీగ లంగాలో దూరబడి ఒకటికి మూడుసారులు కుట్టింది. ఆ బాధ చెప్పశక్యముగానిది. దులపడానికి వీలులేదు. పెడ్లిపీటమీద ఆ బాధ తనకుతక్క అన్యులకు తెలియదు. చివరకు కందిరీగను చేతితో పట్టుకొని దారముతో కట్టివేయగలిగినది. పాపము ఆనాటి ఈ దుస్సంఘటన తనకు ఎప్పుడూ జ్ఞప్తికివస్తూనే ఉంటుంది.

సామాన్యంగా వివాహమంటే మహావేడుక. అటువంటి శుభదినం అందరికీ పండుగే. కొన్నికొన్ని ప్రాంతాల వారి సాంప్రదాయం ప్రకారం రకరకాల వేడుకలు జరుపుతారు. పెండ్లయి దంపతులు యింట్లో ప్రవేశించేముందు ఆడబిడ్డలు అడ్డం నిలబడి నీ భర్త పేరు చెప్పమని ఆ క్రొత్త పెళ్ళికూతుర్ని సిగ్గన్నా వదలందే నిలవేస్తారు. కాని తప్పదు అలా చెబితే ఆడబిడ్డల కెంతో ఉల్లాసం. పైగా పళ్ళెం పడతారు. వారికి ముడుపు చెల్లించందే

దంపతులు ఇంట్లో అడుగుపెట్టే ప్రాప్తం ఉండదు. ఇలాంటివి ఎన్నో చిత్రాతి విచిత్రంగా జరిపించి ఆడబిడ్డను బావమరదులు తమ సరదాలు తీర్చుకొంటారు. పిల్లికి చెలగాటం ఎలుక్కి ప్రాణ సంకటంగా ఉన్నట్లు దంపతులకు మరీ పెండ్లికూతురికి యిబ్బంది. కొంతమంది ఆచారమైతే పెండ్లికొడుకు బుట్టలో కూర్చుంటే పెండ్లికూతురు బుట్ట ఎత్తుకొని అవతల పెట్టాలి. పెండ్లికొడుకు ఇనుప సరుకయ్యే పెండ్లికూతురు నాసిరకమైతే చిక్కే. ఎంత మహానాయకుడైనా మన శాస్త్రిగారికి లలితాదేవికి అలాంటి యిబ్బంది కలుగక పోలేదు. వారి సాంప్రదాయం ప్రకారం లలితా దేవి కాలి క్రింద రుబ్బుడు పత్రాన్ని పెట్టారు. ఒక్క ఊపులో శాస్త్రిగారు దానిని కాలి క్రిందనుండి లాగాలి. ఒకవేళ గట్టిగా నొక్కిపెడితే శాస్త్రిగారు లాగలేకపోతే తన చెలికత్తెలు ఎగతాళి చేయడం యిష్టంలేక తానే తేలికగా అదిమిపెట్టి శాస్త్రిగారి పని సులభం చేసింది.

వారి సాంప్రదాయం ప్రకారం ఒకరి నోట్లో ఒకరు పెరుగు పెట్టవలసి వచ్చింది. ముసుగు ఉండడం వలన శాస్త్రిగారు వధువు నోట్లో పెరుగు పెట్టలేక పోయారు. పెరుగు ముసుగుకు బాగా అంటుకొన్నది. మొత్తంమీద లలితాదేవి చేత బలవంతాన శాస్త్రి గారి నోట పెరుగు పెట్టించారు. ఈ లోపల వరసైనవారు శాస్త్రి గారి బుగ్గలకు పెరుగు పులిమారు.

ఆ పెరుగు పళ్ళెంలోనే ఒక నాణెంవేసి వధూవరులను తీయ మంటారు. ఆ పందెములో కూడా శాస్త్రిగారే గెలిచారు.

నాగరకులు కాబట్టి వెనకాడతారు. అయినా శాస్త్రిగారు ఈ పరీక్షలు నెగ్గక తప్పలేదు.

వివాహానంతరము నెలవుతీసికొని రామనగరువస్తూ శాస్త్రి గారు లలితాదేవితో ఒక్కమాటన్నారు, అదేమిటో తెలుసా! "అమ్మను జాగ్రత్తగా చూడాలి." అది ఆయన కోరిక. తల్లంటే తనకు పంచప్రాణాలు. దురదృష్టవంతులైన ఈ దంపతులకు తండ్రులు చిన్ననాడేపోయారు. అలాంటప్పుడు తల్లి పంచప్రాణాలు కాకేముంది. తల్లిని ఘనంగా సాకేవారిసంఖ్య లోకంలో అరుదు. తల్లిమాట జవదాటి ఎరుగరు శాస్త్రిగారు.

అక్కడనుండి శ్రీ లాలాలజపతిరాయ్ స్థాపించిన సొసైటీలో నెలకు 50 రూపాయలకు ఉద్యోగానికి కుదిరారు శాస్త్రిగారు. సొసైటీ నియమావళి ప్రకారము వివాహమైనవారికి నెలకు పది రూపాయలు పెచ్చుయిస్తారు. పుట్టిన ప్రతి బిడ్డకు పదిరూపాయలు ఇంక్రిమెంటు. అంతేకాక యింటి అద్దెక్రింద నెలకు 20 రూపాయలు ఇచ్చేవారు. వివాహమైన తరువాత జీతం మొత్తం 105 రూపాయలైంది. అది శాస్త్రిగారి దక్షత, సత్యసంధత పట్టుదల కారణమైనా, లలితాదేవి అదృష్ట వంతురాలని అంతా అనేవారు. పెద్దల్లో ఒక విశ్వాసముంది. నిజంగా "గొడ్డొచ్చిన వేళ, బిడ్డొచ్చిన వేళలో విశేషముం"ది. ఒక్కొక్కరు యింట్లో పాదం మోపగానే సిరి కలిసొచ్చిందని మురిసిపోతారు. ఆ విధంగా లలితాదేవిగారి కాపురం కొంచెం పుంజుకొన్నది. శాస్త్రిగారిని ఆ మీదట మీరట్ నుండి బెనారస్, బెనారస్ నుండి అలహాబాదుకు మార్చారు.

జీరోరోడ్‌లో ఒకయిల్లు అద్దెకు తీసుకున్నారు. శాస్త్రిగారి తల్లికూడ అక్కడికే చేరుకున్నారు. మేడపైభాగంలో శాస్త్రిగారి కాపురం. క్రిందిభాగంలో వినోదినిగారి కుటుంబం కాపురముండేది. వినోదిని మనస్సు దేశసేవకు అంకితమైంది. సభలన్నా, సమావేశాలన్నా ముందడుగుమీదుండేది ఆవిడ. పాపం భర్త యింటి పనులు సరిపెట్టుకునేవారు. ఒక్కొక్క కాపురం (దాంపత్యము) అలా సాగిపోతూ ఉంటుంది. వినోదినిగారి దేశ పరాయణత్వపు ఆకాంక్ష బాగా నచ్చింది శాస్త్రిగారికి. లలితాదేవిగారినికూడ అలా ఉండాలని శాస్త్రిగారు అభిప్రాయపడేవారు. ఆడది యింటిపనులు చూచుకొనకపోతే యిల్లు బిడ్డలు పాడైపోతారని లలితమ్మగారి విశ్వాసము. సభలకు, సమావేశాలకు హాజరుకమ్మని శాస్త్రిగారు కోరుకొనేవారు. కాని లలితాదేవి అత్తగారికి యిష్టముండేదికాదు. తల్లి కెదురుచెప్పేవారుకాదు శాస్త్రిగారు.

పెద్ద పెద్ద నాయకులు వచ్చినప్పుడు మాత్రము వారి అత్తగారే సభలకు తీసికొని వెళ్ళేది. అప్పుడప్పుడు అత్తగారి అనుమతితో లలితాదేవిగారు భర్తతో సభలకు వెళ్ళేది. అత్తగారి వెంట వెళ్ళేటప్పుడు పర్దా తప్పనిసరిగా వేసుకోవాలి. పర్దా లేకుండా బైటికి వెళ్ళడానికి అత్తగారికి ఏమాత్రము యిష్టముండదు. అదొక ఆచారము. తల్లి కిష్టములేనిపని చేయవద్దని శాస్త్రిగారి ఉద్బోధ. ఈ విధంగా ఆ దంపతులమధ్య అనురాగాలు, ఆశయాలూ క్షణక్షణం మెదులుతూ ఉండేవి. వారి దాంపత్యంలో కలతలకు ఆస్కారం లేకుండా వారి మనోభావ పరంపరల నొకరి

కొకరు తెల్పుకుంటూ సంసార సాగరాన్ని ఈదడం సుఖతరం చేసు కోవడానికి కృషి సల్పారు.

## సతీపతుల అనురాగము

సురాను రోజులూ మారుతున్నాయి. అప్పటి స్థితి వేరు. వారు కాపురం పెట్టినకడనుండి ఉన్న పరిస్థితులు వేరు. మాట్లాడే విధానం, స్నేహితులను కలుసు కోవడం అవన్నీ వేరుగా ఉండేవి శాస్త్రిగారు పై భాగంలో ఉండేవారుగదా! నిత్య కృత్యంలో ఎక్కి దిగడం చాలా యాతన. ఇక బరువుతో మెట్లు ఎక్కడం బాధగదా! పెద్దతనములో ఉన్న అత్తగారు నీళ్ళు తేవడం యిష్టంలేక కోడలు గారే ఆ పనికి పూనుకొన్నారు.

కాని తానూ ఆడమనిషిగదా! బిందెతో ఎక్కడం దిగడం బాధగానే ఉన్నది. భార్యపడే బాధ భర్తగారికి యిష్టముండేది కాదు అందువలన భర్తగారే నీళ్ళు తెచ్చే విషయంలో తోడ్పడే వారు. మెట్ల దగ్గరకు రాగానే దిగివచ్చి బిందె అందుకొనేవారు. మరలా మెట్లు దిగివచ్చి బిందె యిచ్చి తన పని సుళువుచేసారు. అందువలన కొంత శ్రమ తగ్గింది ఆనాటినుండి లలితాదేవికి.

జీరో రోడ్డులో దాదాపు 8 మాసాలు గడిపి ఆ తరువాత లీడరు రోడ్డుమీద యిల్లు దొరగ్గా మకాం మార్చారు. ఎక్కడికి పోయినా మేడ పైభాగంలో అద్దెకుండడం తప్పలేదు ఏ పని చేయాలన్నా డబ్బుండాలి. డబ్బుంటే మానవుడు బాధలు పడవలసిన పని లేదుగదా! డబ్బే ఉంటే పనిమనిషిని పెట్టుకుంటే నీళ్ళపని,

యింటిపని ఆగుతుందా? వంటవ రూపాయల్తో జీవితం వెళ్ళబుచ్చాలంటే నీళ్ళు, పాలు కొనుక్కు తినాలంటే ఏమూల కబురు? అందువలన లేనివారు ఏదోవిధంగా పొదుపుగా అఘోరించడం తప్పదు. అందువలన భార్య కష్టం చూడలేక డబ్బుతో సుఖపెట్టలేక తానే యింటి పనుల్లో సాయపడుతూ కాలం వెళ్ళదీసేవారు.

క్రిందిభాగంలో మోహన్‌లాల్ గౌతమ్, ఆయన భార్య ఉండేవారు, ఒకరికొకరు తోడుగా ఉండేవారు. అప్పుడువారి పెద్ద కుమార్తె కుసుమ్ కడుపున పడ్డింది. గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం ప్రారంభించారు. ఉద్యమం ఉధృతం కాసాగింది. ఏ క్షణాన ఏమౌతుందో తెలియదు. జైలుయాత్రలు ప్రారంభమైనాయి.

ఒకరోజురాత్రి భోజనంచేస్తూ శాస్త్రిగారు అందరూ వినేటట్లు బహుశా రెండుమూడు రోజుల్లో జైలుకు వెళ్ళాల్సి వస్తుందని టూకీగా అందించారు. అకస్మాత్తుగా యీపని జరిగితే అందరూ ఖంగారుపడతారని ఆయన భావన. ముందుగానే వారిని ధైర్యంగా నిలబెట్టడానికి నేను జైలుకువెళ్తే ఎవ్వరూ ఏడ్వవద్దని అన్నారు. ఏడిస్తే నామీద ప్రేమలేనట్లేనని వారి ఏడుపుకు అడ్డువేశారు

ఆది జరిగిన రెండోరోజో, మూడోరోజో తల్లిగారు యిద్దరు చెల్లెళ్ళను వెంటబెట్టుకొని ఏదో మ్రొక్కుకోసం వింద్యాచల్ వెళ్ళారు. సాయంత్రంలోపల తిరిగివస్తానన్నారు. ఆరోజు శాస్త్రిగారు తాలూకా ముఖ్యపట్టణమైన మేడా వెళ్ళారు. ఆయనకూడ సాయంత్రంలోపల తిరిగి వస్తానని చెప్పి వెళ్ళారు. ఉప్పు సత్యాగ్రహానికి వెళ్తున్నట్లు

చెప్పలేదు. సాయంత్రం ఎన్నిగంటలకు వస్తారని అడిగితే సాధ్య మైనంత తొందరలో వస్తానని వెళ్ళారు. ఆరోజు లలితాశాస్త్రిగారి ఆరోగ్యం బాగుండలేదు. చూలాలు. అన్నిపనులూ సరిపెట్టు కోవాలి. పైగా యిదొక దిగులు. అందువలన వంటపని పూర్తి చేసి భర్తరాగానే వేడివేడిరొట్టెలు కాల్చిపెట్టవచ్చునని పెండి నాన బెట్టింది. ఆరాత్రి వంటచేయడంలో గౌతంగారిభార్య సాయపడింది.

## కటకటాలమధ్య బ్రతుకు ప్రారంభము

చీకటి పడిన తరువాత అత్తగారుగాని, భర్తగారు కాని రాలేదు గౌతమ్ భార్య కొంచం విశ్రాంతి తీసుకోమని చెప్పివెళ్ళింది. శాస్త్రిగారు వచ్చిన పిదప రొట్టెలు చేసి—పెడతాననికూడ అండగా పలికింది. వెళ్ళి పండుకొన్నదేగాని నిద్ర పట్టడంలేదు. ఏవో ఆలోచనలు మనస్సులో అశాంతి బైలుదేరింది. ఆయనగారు ఎందుకని రాలేదు? సత్యాగ్రహం యింకా మొదలు పెట్టలేదు గదా! అని పిట్టగోడ దగ్గరకెళ్ళి నిలబడి దారులు చూస్తోంది. మనస్సులో ఎంతో సొదిలోకూడ అంతే వచ్చింది. కొంచెం సేపట్లో లారీ కన్పించింది.

ఆ లారీలోపలనుంచి "ఇంక్విలాబ్", "గాంధీజీకిజై" అనే నినాదాలు మారు మ్రోగుతున్నాయి. లారీలోపల చాలామంది సత్యాగ్రహులున్నారు. చివరలో శాస్త్రిగారు కూర్చున్నారు. లలితా దేవిని చూచి చేయి ఊపారు. తన అనుమానం నిజమైంది. కను రెప్పలార్పకుండా చూచింది. అయినా యింకా అనుమానం. లారీ

వెళ్ళిపోయింది. కళ్ళవెంట బొటబొట నీళ్ళుకారాయి. ఏడిస్తే ప్రేమ తక్కువన్న శాస్త్రిగారి మాటలు చటుక్కున గుర్తుకొచ్చాయి ఆ మీదట కళ్ళనీళ్ళు కళ్ళలోనే కుక్కు కొన్నది.

క్రిందికి దిగివచ్చింది. ఏమేమో ఆలోచనలు. శాస్త్రిగారు జైలుకు వెళ్ళడం తను చూడడం అదే మొదటిసారి. అయినా ఆయనగారు శాస్త్రిగారు ఔనాకాదా అని సందేహం యింకా తీర కుండాఉంది తనకు. కన్నీరు ఎంత ఆపుకొన్నా ఆగడంలేదు. అవి ఆపలేక పైటచెంగు అడ్డుచేసింది. రాత్రి తొమ్మిది గంటలకు అత్తగారు వచ్చారు. విషయమంతా ఆమెగారికి వివరించి చెప్పింది ఆమెకు నమ్మకంలేదు. పైగా నీవు ఎవరినిచూచి భ్రమ పడ్డావో నని అత్తగారు తరాయించారు. లారీ చివరి భాగంలో టోపీ పెట్టు కొని కూర్చున్నారన్నది "టోపీలు అందరికీ ఉంటాయి, మన అబ్బాయని సిద్ధాంత మేముందని తన వేదాంతముతో సరిగ్గా నీవు చూడలేదని చూచిన కళ్ళను గ్రుడ్డి కళ్ళు చేసింది అత్తగారు. నీవు చూచినవాడు "బచవా"కాదులే పద అన్నం తిందాం అని కోడలు గారికి హుకుం జారీ చేసింది అత్తగారు.

పాపం లలితాదేవికి అసలే ఆరోగ్యం బాగాలేదు. గుండె దడదడలాడుతుంది. పైగా బుద్ధిరాక దిగులు. అత్తగారి ఒత్తిడివలన బలవంతాన ఒకర్రొట్టె ఎంగిలిపడిలేచి మామూలుగా తన అత్తగారికి చదివి వినిపించే రామాయణగ్రంధాన్ని విప్పింది. చాల దగ్గరగా కూర్చుని అత్తగారికి సుందరకాండఘట్టం వినిపించింది. కొద్ది సేపట్లో అమెగార్లు నిద్రపోయారు. ఇంకా పొయ్యి ఆర్పలేదు. ఇంకా వస్తా

రేమోనని ఆశ. ఆశకు అంతులేదుకదా! ఒకవేళ శాస్త్రిగారువస్తే? అని మళ్ళా అనిపించింది. తాను స్వయంగా లారీలోఉన్న భర్తను చూచినా అత్తగారి మాటలవలన ఆ నమ్మకం కాస్త సన్నగిల్లింది. పూర్వము ఎవరో యజ్ఞానికి మేకను తీసుకువెళ్తున్నారట. దానిని దొంగలుచూచి కాజేయ్యాలని నాలుగుచోట్ల ఎడమెడంగా దారికాచి, ఒకరినిమించి ఒకరు ఏం బ్రాహ్మణుడవయ్యా! మరీ పచ్చికలిగా ఉంది. యజ్ఞానికి బలిగా కుక్కను తీసుకెళ్తున్నావా, అని వరుస వరుసగా నలుగురూ అనేశారు ఆ అన్నది ఒక్కరిద్దరుగాదు, నలుగురాయె. ఆ బ్రాహ్మణుడు నిజంగా అది కుక్కేనని భ్రమించి వదిలిపెట్టాడు తనమేకను. ఇదే మంచి అనుగా - వాళ్ళామేకను కాజేసి వారి పబ్బం గడుపుకున్నారు. అదేవిధంగా లలితాదేవిగారు కూడ అత్తగారి వాదనలో గెల్వలేకపోయింది.

దాదాపు పదకొండుగంటలు కావొస్తుంది. ఎవరో తలుపు తట్టారు. శాస్త్రిగారేననుకొని కొంత గుండెధైర్యం తెచ్చుకొని గబ గబావచ్చి తలుపుతీసింది. కాని తలుపుతట్టినవ్యక్తి శాస్త్రిగారుకాదు. శాస్త్రిగారే తాను పోలీస్‌స్టేషనులో ఉన్నాననని తెలియజేయడానికి ఎవర్నో పంపించారు. అత్తగారుకూడ ఈయా సవ్వడివిని లేచి కూర్చొని, ఆ అబ్బాయిని కూర్చుండబెట్టి గబగబా పూరీలు చేయ మనిచెప్పింది కోడలికి. ఆడబిడ్డలుకూడ లేచారు. అందరూ కళ్ళ నీళ్ళు కళ్ళకు కుక్కుకోవడం ప్రారంభించారు.

పూరీలు తీసికొని తల్లిగారు ఆ వచ్చినవ్యక్తితో పోలీస్ స్టేషన్‌కు వెళ్ళింది. అప్పటికే శాస్త్రిగారు మిగతా సత్యాగ్రహులు

భోజనాలు ముగించారు. అయినా అత్తగారి బలవంతాన శాస్త్రీజీ రెండుపూరీలు తిన్నారు. ఆ మీదట ఆమె తిరిగివచ్చి "బచవా" హాయిగా జైలుకెళ్తుంటే నీవు పస్తులుండడమా? అని కోడల్ని పూరీలు తినమన్నది. అత్తగారి ఆజ్ఞ శిరసావహించక తప్పలేదు ఆవిడకు. "బచవా" అంటే తల్లిగారు కొడుకునుపిలిచే ముద్దుపేరు.

ఎంత ప్రయత్నంచేసినా ఆరాత్రి లలితాదేవికి నిద్రపట్టలేదు. ధారావాహికంగా కన్నీరుకారుతూఉంది. కడుపులో దుఃఖముంటే కన్నీరెలా ఆగుతుంది! సరే, శాస్త్రిగారిని మకాలా జైలుకు పంపించారు. కొన్నిరోజులు గడిచాక శాస్త్రిగారిని చూడడానికి వారు దరఖాస్తు పంపించారు. దరఖాస్తు మంజూరయింది. లలితాదేవిగారు ఆడబిడ్డలు అందరూకలిసి వెళ్ళారు. ఇనుప కటకటాలలోపల జైలు గదిలోనికి శాస్త్రిగారు వచ్చారు. తల్లి, చెల్లెండ్రతో కష్టసుఖాలు మాట్లాడుకున్నారు. తల్లిగారుంథద్యంవలన లలితాదేవిగారితో మాట్లాడలేదు. పూర్వము అత్తమామల ఎదుట కొడుకు, కోడండ్రు మాట్లాడుకోవడం తప్పుగా ఎంచేవారు. ఇప్పటికీ ఆ ఆచారాన్ని పాటించే ఏ కొద్దిమందో లేకపోలేదు. యింతలో యిచ్చిన గడువు 20 నిముషాలు ముగిసింది. పోలీసుజవాను వచ్చాడు. శాస్త్రిగారిని తీసికొని వెళ్ళటానికి. వదిన ప్రసవించిన తరువాత ఎవరియింట్లకు వారు వెళ్ళమని అన్నయ్య చెల్లెండ్రకు చెప్పారు. నిజమైన ప్రేమ ఇటువంటి సమయాలలోనే పరీక్షకు నిలబడుతుందనికూడ అన్నాడు. పిదప తల్లిగారి కాళ్ళకు నమస్కరించి లోనికివెళ్ళారు శాస్త్రిగారు.

# భర్త ఎడబాటు సహించలేని భార్య

ఇక వారు జైలు శిక్షతో లీడరు రోడ్డులోని యింటిమకాం ఎత్తివేసి రామనగర్ చేరుకొన్నారు. కుసుమ్ పుట్టగానే పురుడు పోసి ఆడబిడ్డలు అత్తగారిళ్ళకు వెళ్ళారు.

శాస్త్రిగారు జైలుకు వెళ్ళడానికిముందు ఒక పెద్ద ఘట్టం జరిగింది శాస్త్రిగారు లీడరు రోడ్డులోని యింటికి చేరుకోగానే లలితాదేవి ఒక సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. షోలాపూర్‌లో కాంగ్రెస్‌కు సంబంధించిన ఏదో ఒక సంఘటన జరిగిందట. ఆ సంఘటనవలన మార్షల్‌లా జారీ చేయబడింది. అయినా దేశం నలుమూలల నుండి స్వయం సేవకులు వస్తూనే ఉన్నారట. తుపాకీ గుళ్ళకు ఎంతోమంది బలవుతున్నారట. శాస్త్రిగారి పేరుకూడ అక్కడికి వెళ్ళడానికి పంపించారు. ఆ విషయము పురుషోత్తమదాస్ టాండన్‌గారికి తెలిసి లలితాదేవిగారికి శాస్త్రిగారిని పోవద్దని తన తల్లిచేత చెప్పించమని కబురు పంపారట. ఎందుకంటే టాండన్‌గారు ముందుగానే అక్కడకు వెళ్ళవద్దని గట్టిగా సలహాయిచ్చారట. కాని ఆయన వారి మాట వినసందున ఈ విధంగా కబురు పంపించారు ఈ విషయం లలితాదేవి అత్తగారికి నివేదించింది. ఆమెవిని పది నిమిషాలు మౌనము పాటించింది. తదుపరి తననిర్ణయాన్ని బైటపెట్టింది "నేను బచవాను వెళ్ళొద్దని చెప్పను. ముందుకు వేసిన అడుగును వెనుకకువేయు మనడం మంచిదికాదు. దైవనిర్ణయం ఏది ఎలాఉంటే అది అలా

జరిగితీరుతుంది''. అని అన్నారామె. అత్తగారిమాటలువిని లలితాదేవి ఘొల్లున ఏడ్చింది. సాయంత్రానికి శాస్త్రిగారు యింటికి రానే వచ్చారు.

వెంటనే వారితో మాట్లాడడానికి లలితాదేవికి వీలు చిక్కలేదు. భోజనాలయ్యాక వారితో ముచ్చటించడానికి వీలుచిక్కింది. షోలాపూర్ వెళ్ళవద్దని తన ప్రియమైనభర్తను ఎంతగానో బ్రతిమలాడింది, ప్రాధేయపడింది లలితాదేవి. కాని శాస్త్రిగారు అక్కడికి నేను వెళ్ళితీరాల్సిందేనన్నారు. అయితే నన్నుకూడ అక్కడికి తీసికెళ్ళమని కోరింది. అక్కడ నీవేమి చేస్తావని శాస్త్రిగారు ప్రశ్నించారు. మనిద్దరం వెళితే అమ్మనెవరు చూస్తారన్నారు. అయితే నేనిక్కడ ఒంటరిగా ఉండను మీరు ఎక్కడికి వెళ్తే నేనక్కడికి వస్తానని పట్టుబట్టింది లలితాదేవి. రావడానికి వీల్లేదని శాస్త్రిగారు మందలించారు. ఎక్కెక్కి ఏడ్వడం ప్రారంభించింది ఆవిడ. శాస్త్రిగారికి ఒకప్రక్క జాలి, మరొక ప్రక్క కోపం బాగా రగులుకుంది. కోపం ఆపుకోలేక నీవు నన్ను తిట్టినా ఇంత కష్టంగా ఉండేదికాదు. నీ మాటలు నన్ను బాధపెడ్తున్నాయి. ముందు ముందు నేను యిలాంటి కార్యక్రమాలు చాలా ఎదుర్కొనవలసి ఉంది నేను నిన్ను ఎక్కడికి తీసుకెళ్ళనని కోపగించుకొన్నారు. మరలా భార్య దీనస్థితికి జాలివేసింది కొంత నిమ్మళించారు. తాపీగా ఆలోచించారు. చివరకి తన నిర్ణయాన్ని లలితాదేవితో చెప్పారు. అయితే నేను షోలాపూర్ వెళ్ళడం మానివేస్తున్నాను. కాని ఒక్క షరతు ఇక ముందుముందు అడ్డురావని మాటిమ్మని తన తప్పుకు

చెవులు పట్టుకోమన్నారు. భర్తముందు చెవులు పట్టుకొంటే తప్పే ముంది. అలాగేనని చెవులు పట్టుకొని చివరకు తనమాట నిలబెట్టు కొన్నది లలితాదేవి.

లీడరుగారొచ్చి ఇంటిలో లలితాదేవి అత్తగారు ఆడబిడ్డలు వాళ్ళ పిల్లలేకాక ప్రతిదినం యిద్దరు ముగ్గురు అతిథులు వస్తూవుండేవారు. ఉదయం 5 గంటలకు లేస్తే రాత్రి ప్రొద్దుపోయేవరకు తీరేదికాదు. లలితాదేవికి ఉదయానలేచి యిల్లువాకిలిచిమ్మి, అంట్లుతోమి, పని వెంట పని ముగించేసరికి పన్నెండు గంటలయ్యేది. ఆ తరువాత గుడ్డలుతకడం ఏవోఒకపని ఉంటూనేవుండేది. రాత్రి భోజనమైన తరువాత అత్తగారికి రామాయణం చదివి వినిపిస్తేగాని ప్రక్క వాల్చేదికాదు లలితాదేవి. భార్య బట్టలుతికి అరవచాకిరి చేస్తూఉంటే భర్తగారుచూచి సహించేవారుకాదు. బహుశా తల్లిప్రేమ, భార్య ప్రేమ త్రాసుపెట్టిచూస్తే త్రాసుముల్లు ఎటూ వంగేదికాదేమో ! అందువలన ఇటు తల్లిగారిని ఏమనలేకపోయారు. గుడ్డలుతికేసమ యంలో స్నానమనే నెపంతో గబగబా సగం బట్టలుతికి భార్యపని సుళువుచేసేవారు. ఎంత జాలిపరులు, ఎంత విశాల స్వభావులు. వారి స్నానంముగిశాక గుడ్డలు ఆరవేసేది శ్రీమతి లలితాశాస్త్రి.

మరీ అలిసిపోతే కొంచంసేపు నిద్రపొమ్మని సలహాయిచ్చే వారు శాస్త్రిగారు. ఆలస్యంగాలేస్తే అత్తగారు ఊరుకొనేదికాదు. ఆ ఆలస్యానికి ఏవో సాకులుచెప్పి తల్లికి సర్దిచెప్పేవారు శాస్త్రిగారు. కొడుకున్నంతసేపు ఊరకుండి ఆయన వెళ్ళగానే ఆగిన పనేమిటని కోడల్ని ఆరాతీసేది. అబద్ధాలకు అలవాటుపడ్డవారికి వెంటనే సమా

ధానాలు దొరుకుతాయి. ఎన్నడూ వాటిజోలికిపోనివారికి యిబ్బందే! రానురాను తల్లిగారి పోకడనుబట్టి ఆమెమాట ఉల్లంఘించక తప్పేది కాదు.

మామిడిపండ్లన్నా, ఫాల్సా పండ్లన్నా శాస్త్రిగారికి ఎక్కువ యిష్టం. ఫాల్సాల తరుణంలో రెండు మూడుపైసల పండ్లు ప్రతి రోజు శాస్త్రిగారు యింటికి తెచ్చేవారు. కొన్నిపండ్లు ఊరకనే తినే వారు. కొన్ని రసంతీసియిస్తే త్రాగేవారు, ఒకరోజు మధ్యాహ్నం ఎక్కువపండ్లుతెచ్చారు. ఆరోజు లలితాదేవి ఎక్కువపండ్లు తినే సింది. అత్తగారు రామనగర్ వెళ్ళారు. అప్పుడు కుసుమ్ కడుపు లోనే ఉంది ఫాల్సాపండ్లు దగ్గరపెట్టుకొని నిద్రపోయింది. శాస్త్రి, గారు అవతలిగదిలో నిద్రపోతున్నారు. మెలకువవచ్చాక లేచి చూస్తే దోనెలో నాలుగైదు పండ్లకంటే ఎక్కువలేవు. భార్యాభర్త లిద్దరూతప్ప యింట్లో ఎవ్వరూలేరు. నేను తిన్నానని భర్తగారు ఏమన్నా అనుకొంటారేమోనని లలితాదేవి భయం. శాస్త్రిగారి గది లోకి వెళ్ళి విషయం ఏడుస్తూ చెప్పింది, ఆయన పకపకానవ్వి నీవు తిండిపోతువని నేను అనలేదుగదా. ఎందుకు నీకింత భయం. అమ్మ ఫాల్సాలరసం నీకు మంచిదనిచెపితే నీకు తెచ్చానని ఊరడించారు.

## లలితాదేవిగారి పికెటింగ్

తన సతీమణికూడా సత్యాగ్రహంలో పాల్గొన వలెనని శాస్త్రిగారి తాపత్రయం. అందుకు తనతల్లిగారు ససేమీ ఒప్పుకో లేదు. ఏం చేయాలి. ఆ రోజుల్లో విదేశీ వస్తు బహిష్కరణోద్య

మం ప్రారంభమైంది. అన్నిచోట్ల చాల పట్టుదలతో సత్యాగ్రహులు పాల్గొంటున్నారు. ఒకరోజు కమలానెహ్రూగారు మీ భార్య నెందుకు పంపరని శాస్త్రిగారిని నిగ్గదీశారు. ఆయన సమాధానము వెంటనే చెప్పలేకపోయారు. ఆమెను మీరు బైటకు తీసుకు రావ లసిందేగాని నావల్ల కాదని తన అశక్తతను కమలానెహ్రూగారికి తెలియజేశారు. వారి మాటైతే తన తల్లి త్రోసిపుచ్చదని శాస్త్రిగారి అభిప్రాయము.

ఒకరోజు కమలానెహ్రూగారు 'ఎక్కా' మీద శాస్త్రిగారు న్నయింటికి వెళ్ళారు. లలితాదేవిని పికెటింగ్‌కు పంపమని అడిగింది అంత పెద్దవారు అడిగితే కాదనలేక ఉక్కిరి బిక్కిరై ఎలాగో ఒప్పుకుంది. సరే లలితాదేవిగారు రెండోరోజు బైలుదేరారు. మొదటిరోజు ఏమి చేయాలో తెలియక భర్త నడిగింది. షాపుల వద్ద నిలబడి విదేశీ వస్త్రాలను కొనువారిని బహు నమ్రతగా వాటిని కొనవద్దని నచ్చచెప్పాలి. కోపం పనికిరాదు. మన విన యంలో వారిని తృప్తిపరచి ఆ బట్టలను కొనకుండా చేయాలని ఉద్బోధించారు శాస్త్రిగారు.

తన స్నేహితురాలు గౌతమ్ భార్య లలితాదేవి యిద్దరూ ఒక దుకాణంముందు నిలబడ్డారు. గడపదాటి బైటకురాని స్త్రీలు ఆడవారినితప్ప మగవారిని అర్థించలేకపోతున్నారు. పరపురుషులతో మాట్లాడాలంటే కొంత ధైర్యం కావాలి. మగవారితో మాట్లాడా లంటే సహజంగా బిడియం అడ్డువస్తుంది. అందువలన ఆ విధంగా ఆడవారినే కొనవద్దని ఆ రోజు మొట్టమొదటిరోజుగాన అలా

జరిపారు. వారి డ్యూటీ ఉదయం 11 గంటలు మొదలుకొని సాయంత్రం రెండు గంటలవరకు. 11½ గంటలకు వారి కెదురుగా నున్న కొట్టువానికి కొనుగోలు దారునికి మాటమాట పెరిగింది. ఇంతలో ఎవడో దుకాణానికి నిప్పంటించాడు. వాతావరణం గందర గోళమయింది. అశాంతి ప్రబలింది. పోలీసులు హుటాహుటిని వచ్చారు. ఇక వారు అక్కడ నిలబడితే పరాభవం వాటిల్లు తుందే మోనని ఒణికిపోయారు. గౌతమ్‌గారి భార్య యిక యింటికి వెళ్దా మని తొందర పెట్టిందిగాని, లలితాదేవి మాత్రం టైముకాందే యింటికి వెళ్తే శాస్త్రిగారు ఏమంటారోనని భయంతో ఎప్పైనా టైమయ్యే వరకు ఉందామని మొండికేసింది. వదినా మనం ఆడ వాళ్ళం. ఉంటే అవమానాలు తప్పవు వెళ్దామని ఒత్తిడిచేసింది. ఆమె ఒత్తిడికి తట్టుకోలేక ఆడబిడ్డలిద్దరూ యిల్లు చేరారు. శాస్త్రి గారు, గౌతమ్‌గారు యింటిదగ్గరలేరు. వారు యింటికి వచ్చాక గౌతమ్ గారు తన భార్యను గోలచేయడం ప్రారంభించారు. ప్రాణ మంటే అంతతీపా? అంత పిరికి దేనికని ఆటలు పట్టించారు మీ వదినగారు ఉందామన్నా నిలవకుండా బైలుదేర తీసుకొచ్చారని ఏమేమో అన్నారు. గౌతమ్‌గారు శాస్త్రిగారికంటే రెండేళ్ళు చిన్న యినందున అన్నదమ్ములుగా అలా కలసిపోయారు. అందుకనే వదినా మరదళ్ళనే ఆప్యాయతతో కలసిపోయారు.

ఒకటా రెంటా చెడితేగాని వైద్యుడుకాడు ఎవరైనా. మూడోరోజు మగవాళ్ళనుకూడా కొనకుండా అడ్డుకొనే ధైర్యం వచ్చింది ఆడబిడ్డలిరువురికీ. ఆడవారిని, మగవారిని ధైర్యంగా

విదేశీవస్త్రాలు కొనవద్దని నమ్రతగా నచ్చచెప్పడం ప్రారంభించారు ఆరోజు అలా గడిచింది. శాస్త్రిగారు గౌతమ్ ఆడబిడ్డ లిరువురూ రెండుగంటలకు యిల్లుచేరారు టైము అయ్యాక.

నాలుగోరోజు యథావిధిగా టైముకు ఆడబిడ్డ లిరువురూ డ్యూటీకి హాజరై పికెటింగ్ ప్రారంభించారు. అప్పుడు ఒక సోదరుడు, సోదరి, తనభార్య కలసి పెండ్లిబట్టలు కొంటున్నారు. అయిదారువందల రూపాయల బట్టలు కొన్నారు. సరే వీరు ఆ బట్టలు కొనవద్దని ఎదుర్కొన్నారు. పెద్దబేరం చెడగొడుతున్నారంటే సహజంగా దుకాణదారునకు కోపమేగదా! ఆ కోపముతో "విదేశవస్త్రాలు వద్దంటున్నారు. మీరేమో విదేశీగాజులు ధరించార"ని హేళనగా ఎత్తిపొడిచాడు పికెటింగ్‌దారుల్ని షాప్‌కీపర్.

గాజులు విదేశీవికావని వారి అభిప్రాయం. వాడేమో అవి విదేశీవేనని రెట్టింపసాగాడు. కాదనివారు. మువ్మాటికీ గాజులు విదేశీవే అన్నాడు షాపువాడు. "మీరు పెట్టుకొన్న గడియారము విదేశీదేగదా" అనిఅన్నది గౌతమ్‌భార్య. "నాను విదేశీసరుకు అమ్మువాడికి నాకేమిటి? విదేశీసరుకంటే మీకులాగా నాకు ఏహ్యాము కాదుగదా? అని అన్నాడు.

రోషాలు పెరిగినవి. గాజులు పగులగొడితే అత్తగారేమంటారోనని లలితాదేవికి భయం. ఎలాగైనా అత్తచాటు కోడలుగదా? స్వేచ్ఛ ఏదీ? సర్వసాధారణంగా తల్లికి కొడుకే ఎదురు చెప్పడాయె. అందువలన వాడిమీద పంతంతో గాజులు తీయడానికి

లలితాదేవి తటపటాయించింది. చివరకు గుండె ధైర్యము చిక్కబట్టుకొని పైటచెంగు చాటున ఒక్కొక్క గాజు తీసివేసి మూటగట్టింది లలితాదేవి. ఇక ధైర్యంగా నిలబడి అయితే అవి విదేశీవైతే మేము మా గాజులు పగలగొడతాము నీవు నీ గడియారాన్ని పగుల గొడతావాయని నిగ్గదీసింది లలితాదేవి. మహారాజులాగా అన్నాడు దుకాణాదారుడు. ఇంతలో శాస్త్రిగారు అక్కడికి చేరుకొన్నారు. విషయమంతా చెప్పారు. గాజులు విదేశీ వంటున్నాడతను మీరేమంటారు అని శాస్త్రిగారి నడిగారు. అయితే అనుమానం దేనికి పగలుగొట్టమని సైగజేశారు శాస్త్రిగారు సైగ అందుకోగానే వదినామరదళ్ళిద్దరూ తమగాజులు తీసి ఫక్కుఫక్కున పగులగొట్టారు.

సరే నీవంతు కానీయమన్నారు. నాకేమి అవసరమని దుకాణదారుడు యికిలించాడు, బట్టలు కొనే సోదరీ సోదరులు తన భార్య అంతా గమనిస్తూనే ఉన్నారు. వాని అవకతవక మాటలకు మండిపోయి ఆ పెండ్లిబట్టలు కొనే అమ్మాయి "నీవు ధూర్తుడివి. దుర్మార్గుడివి ! ఆ అమ్మాయి గాజులు పగలగొట్టించి నీవు జారుకుంటున్నావా ? నీకు సిగ్గులేదూ ? హిందూస్త్రీకి గాజు పూసంటే ఏమనుకొన్నావు ? వారి మాంగల్యబలంకదా ? అంత పవిత్రమైన గాజుల్ని భర్త ఎదుటే పగులగొట్టించి సిగ్గులేక తప్పుకొంటున్నావా అని నాలుగు దులిపే సరికి ఆమె భర్తకూడ ఆదుర్మార్గానికి ఆగ్రహుడై కొన్న బట్టలకే వాడి కొట్టులోనే నిప్పుపెట్టాడు: అంతటితో దుకాణం మొత్తం దగ్ధమైపోయింది.

ఎక్కడివాళ్ళక్కడ సర్దుకొన్నారు. శాస్త్రిగారు, గౌతమ్ ఎప్పుడు వెళ్ళిపోయారో లలితాదేవి గమనించలేదు. ఇంటికి వెళ్ళ గానే కోడలిగారి మొండిచేతులుచూచి అత్తగారు కోపగించింది. ఔను పెద్దవారికి ఆచారాన్ని అనాచారం చేయడం తప్పుగదా ! ఆ నాటికి జరిగినసంగతి చెప్పి తప్పించుకున్నారు లలితాదేవి.

## కన్నబిడ్డలతో ముద్దుముచ్చట

జైలునుండి ఆరుమాసాలకు శాస్త్రిగారు విడుదలై వచ్చారు. కొన్నిరోజులుమాత్రం రామ్‌నగర్‌లో గడిపి తరువాత బహదూర్ గంజ్‌కి మకాం మార్చారు. ఇక అక్కడనుండి బ్రిటిష్‌ప్రభుత్వంతో ఏ క్షణాన ఏమి జరుగుతుందో తెలియదుగదా ! త్యాగజీవులు ఎట్టి కష్టాలకు వెనుకాడరు.

ఒకరోజు స్నానానికని తుండుగుడ్డ పైన వేసుకొని బైలు దేరాడు. ప్రక్కనే కుసుమ్ ఉయ్యాలలో కాళ్ళు ఊపుతూ ముద్దుగా కనిపించింది. బిడియంచేత కొంతమంది నలుగురైదుగురు బిడ్డలు పుట్టినా తల్లిదండ్రి ఎదుట అరవిడిచి మాట్లాడుకోరు. ఏదైనా అవ సరమైతే పిల్లల నడ్డంపెట్టి మాట్లాడుకొంటారు, కొంతమందికి బిడ్డ లంటే ముద్దుగాఉన్నా తల్లిదండ్రి ఏమన్నా అనుకొంటారేమోనని బహిరంగంగా ఎత్తుకొని ముద్దాడలేరు. అసలు కొంతమందికి పసి బిడ్డలంటే ముద్దేఉండదు. పైపెచ్చు ఎత్తుకోమని యివ్వబోతే చీద రించుకుంటారు. ఈ విధంగా భిన్నభిన్న రుచులుగల తల్లిదండ్రు లుంటారు.

మన శాస్త్రిగారికి పిల్లలంటే ముద్దేగాని తల్లిఎదుట తనబిడ్డను ముద్దాడటమంటే తగని సిగ్గు. సామాన్యంగా ముసలాళ్లు యింట్లో ఉండాలనేగానీ ఆయాల్లాగా పసిబిడ్డల మంచీచెడూ అంతా వారే చూచుకొంటారు. తల్లివంతు పాలియ్యటంమాత్రమే. శాస్త్రిగారి తల్లిగారి ఉద్యోగం బిడ్డల్ని పరామర్శించడమే.

ఆరోజు పాపనువదలి తల్లిగారు ప్రక్కవారింటికి ఏదో పని మీదవెళ్ళారు. శాస్త్రిగారికి కుసుమ్‌ను ముద్దాడడానికి మంచిసమయం చిక్కింది. ఇక బిడ్డమీద ముద్దు ఆపుకోలేకపోయారు. గభాలున బిడ్డను లాలించడం ప్రారంభించారు. తల్లిగారుంటే లాలించటం అటుంచి కనీసం బిడ్డపైపుకూడ కన్నెత్తి చూసేవారుకాదట. ఇంతలో తల్లి అకస్మాత్తుగా రానేవచ్చింది. శాస్త్రిగారు తల్లిచేతిలో పట్టు బడ్డారు. ఇక తప్పుకోలేక చిన్నపిల్లలనుచూస్తే ఆడించ బుద్ధిపుడు తుందని అన్నారట.

ఇంకేం మా బరువు తీరుతుంది నీ ముద్దు తీరుతుంది రోజూ ఆడించరాదా అని తల్లిగారు అనుమతిచ్చింది. అది మొదలుకొని తన బిడియాన్నికాస్త ఆవలికి పంపించి కన్నబిడ్డను తీరిక చిక్కి నప్పుడల్లా ఆడించడం ప్రారంభించారు. ఆ విధంగా బిడ్డపై తన ముద్దు తీర్చుకున్నారు.

లలితాదేవికి పెండ్లప్పుడు నాలుగైదు నగలు పెట్టారు. కలిగినవారు మొయ్యలేని నగలు పెట్టుకొంటారు. కాని అంపకాలైన తరువాత అత్తగారింటి కెళ్ళేటప్పుడు దగ్గరబంధువులంతా తలొకనగా

కానుకగాఇచ్చారు లలితాదేవికి. పెద్దపెద్ద ఖర్చులలో బంధువులు ఈ విధంగా ఆదుకోవడం ఒక విధంగా చాలా ఉపయుక్తమే. ఈ ఆచారము మంచి భావముతోనే మన పెద్దలు ప్రవేశపెట్టారని మనము భావించాలి. అన్నీకలసి లలితాదేవికి దాదాపు రెండువేలు ఖరీదుచేసే నగలయ్యాయి. అందువలన తనకు ఎక్కడలేని ఆనందం కలిగింది.

సామాన్యంగా పేదకుటుంబాలలో నామకావాస్తే పెళ్ళినాడు ఎరువు సొమ్ములుపెట్టి ఆ తరువాత తీసుకోగానే ఇక ఆ కాపురములో సెగలు పొగలు రేగుతాయి. ఉన్నవారికి ఈ అనుభవం అంతు పట్టదనుకోండి. మధ్య కుటుంబీకులు ఒక మాదిరిగా జరుపుతారు పెండ్లిండ్లు. ఎందుకంటే ఆడపిల్లలకు సొమ్ములంటే మోజు ఎక్కువ. అలాగే గాజులన్నా బట్టలన్నా ఎంతో యిష్టపడతారు. అప్పటికి తనకున్న నగలకు లలితాదేవి ఎంతో తృప్తిపడింది.

అప్పుడు బహదుర్‌గంజ్‌లో ఉంటున్నారు. శాస్త్రిగారి పినతండ్రికి వ్యాపారములో పెద్ద నష్టం సంభవించింది. దానికి వీరు ఆదుకోవలసి వచ్చింది. డబ్బున్నవారికి దయాదాక్షిణ్యాలు తరుగు. లేనివారే ఉన్నదానిలో ఎంతో త్యాగంచేసి ఆపదలో అడ్డుపడతారు. అలాంటి త్యాగమేమన శాస్త్రిగారు చేయవలసి వచ్చింది. వారి దగ్గర డబ్బేముంది? సహాయం చేయడానికి. ఇక ఆ నగలే కనిపిస్తున్నవి. అందులో కొన్నినగలు తీసిచ్చి ఆ యిబ్బందికి అడ్డపడ్డారు. లలితాదేవికి యిష్టం లేకపోయినా భర్త మనస్సు కష్టు

పెట్టడం యిష్టంలేక సంతోషంగా యిచ్చివేసింది. టీకా, కాలిమట్టెలు ముక్కుపుడక మాత్రం అట్టిపెట్టుకొంది. ఎందుకంటే అవి సౌభాగ్య చిహ్నాలు. నిజంగా అవికూడా లేకపోతే ముఖం బోసికొడుతూ ఉంటుంది. ఆనగలు తీసి యిచ్చారేగాని శాస్త్రిగారు లోలోపల చాలా బాధపడ్డారు. మీర్జాపురం వెళ్ళినప్పుడు ఏమి చెప్పగలవని సందేహాన్ని వెలిబుచ్చారు.

లలితాదేవి ఒక్క చిరునవ్వునవ్వి, "మీకేమి విచారం భయం అక్కర్లేదు. వారికి నచ్చచెప్పేభారము నాదని" ధైర్యం చెప్పింది. అదేదో తనకు చెప్పమన్నారు శాస్త్రిగారు. గాంధీజీ ఆదేశం ప్రకారం నగలుతీసి వేశానని చెబుతానన్నది. శాస్త్రిగారు తన భార్య సమయోచిత జ్ఞానానికి, త్యాగానికి ముగ్ధులైపోయి కొంచం సేపటివరకు మాట్లాడలేదు. "పాపం నీవు నన్ను చేసుకొని అష్టకష్టాలు అనుభవిస్తున్నావు" నిన్ను చేసికొని నేను సుఖపెట్టలేక పోతున్నాను. ఇదే ఏ కల్గినవారితోనో వియ్యమందితే సుఖపడే దానివి. నేను దౌర్భాగ్యుడనై సుఖపెట్టలేకపోగా, పెట్టిన నగలు కూడ తీసికొన్నానని బాధపడ్డారు.

విలువలేని బంగారం లేకపోయినా అసలు బంగారము నాకుందిగా, అదిచాలు. మీకు దిగులు దేనికనేసరికి శాస్త్రిగారు మాట్లాడలేక పోయారు. తోచక అటుయిటూ పచార్లుచేశారు. ఆమె ఏదో పనిమీద నిమగ్నురాలైంది. అదే యింకొక గయ్యాళి యిల్లాలైతే అడ్డమైన వాళ్ళందరికి నా తల్లిదండ్రులు పెట్టిన నగలు అడ్డంపెడతావా, నీవు పెట్టినవి ఏమైనాఉంటే తీసుకొని అమ్ముకో.

అని అడ్డం తిరిగేవారు. తన భావాలకు తగిన భార్య దొరికిందని శాస్త్రిగారు ఎంతో సంతోషంతో గర్వపడ్డారు.

## ఎగ్జిబిషన్ చూడాలని ఉబలాటము

బహదూర్ గంజ్ యింట్లో క్రిందభాగం కొంత శాస్త్రిగారి క్రిందే ఉండేది. ఆ క్రిందిభాగంలోనే వంటచేసుకొనేవారు. గౌతమ్‌గారు ప్రక్కయింటిలో ఉండేవారు. ఆయనభార్య లలితాదేవికి ప్రాణ స్నేహితురాలు. ఒకసారి లలితాదేవిగారికి అత్తగారు ఏదోపనిమీద రామనగరువెళ్తూ కుమారునితో బియ్యం; గోధుమపిండి అయిపో యింది తెప్పించమని అప్పగింతలుపెట్టి పోయింది. లలితాదేవి అలా చెప్పదు. ఎందుకంటే భర్తగారిని కష్టపెట్టడం యిష్టంలేక.

శాస్త్రిగారు పగలు రెండు రొట్టెలు కొద్దిగా అన్నంతింటారు. రాత్రిపూట రెండు రొట్టెలుతిని పడుకొంటారు. అత్తగారు వెళ్ళిన తరువాత పిండిలేసందున రెండుమూడు రొట్టెలుచేసి అవే భర్తకు పెట్టి రెండుమెతుకులు ఎంగిలిపడేది. ఆయనగారి గదిలోకి అన్నం రొట్టెలుయిచ్చి వచ్చేది. ఆయనగారు భోజనం పూర్తిచేసేలోపల తాను క్రిందిభాగంలో భోజనం పూర్తిచేసేది. ఇలా పూర్తిచేయడం చూచి "ఏం రామనగర్‌లో అన్నంతింటూనే నిద్రపోయేదానివట. యిప్పుడు క్షణంలో ముగిస్తున్నా"వని అడిగేవారుకాని అసలుసంగతి తెలుసుకోకుండా ఆహారనియమాలు వల్లిస్తూ ఆహారం బాగా నమిలి మ్రింగాలి. లేకపోతే సరిగా జీర్ణంకాదని ఆరోగ్య సూత్రాలు చెప్పేవారు.

అత్తగారు 20 రోజులకు తిరిగి వచ్చారు. లలితాదేవిగారు తిండితినక ఎండి పుల్లలాగ ఉంది. కోడల్ని ఎగాదిగా చూచింది. వివరమడిగింది. ఉన్న విషయమంతా కోడలుగారు నివేదించింది. తల్లి వెంటనే వంటయిల్లు చూచింది తరువాత బచాహ దగ్గరకు వెళ్ళింది. ఇక ప్రశ్న మీద ప్రశ్న కుంభవర్షం కురిపించింది. దానితో శాస్త్రిగారుఉక్కిరిబిక్కిరై తాను చెప్పందే నేనేమి చేసేదని తప్పు కొన్నారు. అది అయిపోతే నీతో చెప్పదనేగా నేను నీకు ముందుగా చెప్పిందని నానాచీవాట్లుపెట్టింది. పాపం బిడ్డ ఎదురు మాట్లాడలేదు. గుడ్డలు మార్చుకొంటూ ఉన్న యధార్థం తల్లిద్వారా తెలిసికొని శాస్త్రిగారు చాల విచారపడ్డారు.

ఒకరోజు శాస్త్రిగారు కొన్ని నేరేడుపండ్లు తెచ్చారు. అవి నల్లగా నిగనిగలాడుతున్నాయి. వాటి వైఖరిచూచి తినాలని బుద్ధి పుట్టింది లలితాదేవికి. లెక్కఉంటాయంటలెమ్మని నాలుగుపళ్ళను గబగబా తినేసింది. కొంత సేపయ్యాక అద్దం చూసుకుంది. నోరు రంగుపూసుకొన్నట్లుంది. గబగబా స్నానాలగదికివెళ్ళి నోరు కడుక్కొన్నది భర్తగారేమంటారోననే భయంతో ఆవిడ ఆ విధంగా చేసింది.

ఒకసారి ఎగ్జిబిషన్‌కు వెళ్ళాలని ఆశకలిగింది లలితాదేవికి. చుట్టుప్రక్కలవారంతా వెళ్తున్నారు. అందరినీ చూస్తుంటే తనకూ వెళ్ళాలని ఆశకల్గింది. అందువలన తనకోర్కెతీర్చమని భర్తగార్ని అడిగింది లలితాదేవి. ఒకరోజు సరేనన్నారు ఆ మీదట తనకున్న ఒక్క మంచిచీరెను సబ్బుపెట్టి ఉతికి సాయంకాలము పెందలాడే

వంట తయారుచేసి, చీరె కట్టుకొని భర్తకోసం ఎదురుచూడడం సాగించింది. పాపం ఆ రోజుల్లో లలితాదేవికి రెండు లేక మూడు చీరెలకంటే ఎక్కువ వుండేవికావు. అందువల్లన అవి చక్కగా ఉతుక్కొని ఎంతో సంభరంగా ఎగ్జిబిషన్‌కు వెళ్దామని భర్తకోసం ఎదురుచూడ్డం ప్రారంభించింది.

శాస్త్రిగారు సాయంకాలము రాలేదు. రాత్రికి యిల్లు చేరుకొన్నారు. రాజకీయనాయకులకు తీరుబడి ఉంటుందా? ఏదో పని గలిగి ఆగిపోయారట. మర్నాడు తప్పకుండా వెళ్దామని లలితాదేవిని బుజ్జగించారు. మర్నాడు అలాగే యధావిధిగా ఎదురుచూచింది లలితాదేవి. ఆరోజుకూడా ఆలశ్యంగా వచ్చారు. అలశ్యానికి కారణం చెప్పారు. ఇక నోరెత్తలేదు. మర్నాడు తప్పకుండా వెళ్దామన్నారు. అప్పటికది మూడోరోజు. వరసైన వదినలు, మరదళ్ళు లలితాదేవిని ఉడికించడం మొదలుపెట్టారు నిజమే, ఒకటా రెండా వాయిదాలు? అప్పటికి మూడు వాయిదాలైపోయినాయి. ఆరోజు అలాగే జరిగింది. చుట్టుప్రక్కలవారి గోలకు తట్టుకోలేక "అంతా నన్ను ఆటలు పట్టిస్తున్నారు. ఇక మీరు నన్ను తీసుకెళ్ళకపోతే నేను సత్యాగ్రహం చేస్తాను" అన్నది శాస్త్రిగారు చిరునవ్వొకటి తేలిగ్గా వదిలి రేపు తప్పకుండా తీసుకెళ్తానని మాట యిచ్చారు.

ఎట్టకేళకు ఆరోజు ముహూర్తం కుదిరింది. సమయానికి ఒక్క ఐదురూపాయలిమ్మని అడిగింది లలితాదేవి శాస్త్రిగారిని. ఏదీ! ఉంటేనేగా. జేబులో చేయిపెట్టి రూపాయన్నర తీసి ఆమె

చేతిలో పెట్టారు. ఆ రూపాయన్నర తిరిగి యిచ్చివేసి, "నేను రానని" మొండికేసింది. సరే విధిలేక ఎన్నడూ అప్పు చేయని పెద్దమనిషి తన ఆడబిడ్డ నడుగుమని లలితాదేవికి పర్మిషను యిచ్చారు. ఇదంతా చూస్తున్న ఆడబిడ్డ కల్పించుకొని "పోనీ అన్నయ్యా! ఆమె ఎప్పుడూ అడగనే అడగదు. అడిగినకోర్కె తీర్చమని," నచ్చజెప్పి ఐదు రూపాయలు బదులిచ్చిందది.

సంతోషంగా యిద్దరూ ఎగ్జిబిషన్‌కు బయలుదేరారు. రకరకాల వస్తువులు దుకాణాలలో చూడ ముచ్చటగా ఉన్నాయి. ప్రతి వస్తువూ కొనాలనిపించింది. కాని వారిచేతిలో ఉంది ఐదురూపాయ లేగా! చేతిలో డబ్బుఉంటేనే ఏ భోగమైనా! పేదవారికోర్కెలు ఎండమావుల్లాంటివి. అవి చేతి కందనివి. అవి అనుభవించేవారు వేరే పెట్టిపుట్టి ఉన్నారు. నచ్చిన వస్తువు కొందామని దుకాణం ముందు ఆగినా యిక్కడకాదు పై షాపులలో మంచి వస్తువులున్నవని దాటవేసి ఎగ్జిబిషనంతా త్రిప్పారు కాని ఒక్క వస్తువుకూడా కొనలేదు శాస్త్రిగారు. అఖరికి పైసా ఖర్చుకాకుండా ముద్దరసుద్దిగా ఐదు రూపాయలు యింటికి పట్టుకొచ్చారు. పైగా ఏమీ కొనలేదని నీకు కోపమా? అని ఎదురు ప్రశ్న వేశారు శాస్త్రిగారు. ఆమె గుణం తనకు తెలుసు. ఐనా మనం అప్పుజేసి వస్తువులు కొనడం మంచిది గాదని సలహాచెప్పి ఆ ఐదు రూపాయలు అప్పు తెచ్చిన చోట యిచ్చివేశారు. ఇక లలితాదేవి శాస్త్రిగారిని ఏమీ అనలేదు, పాపం ఆయన తత్వం ఎగ్జిబిషన్‌లోనే తెలిసిపోయింది.

# అడ్డుపడిన ఆచారాలు

తినమరిగినకోడి యిల్లెక్కి కూసిందట. అలాగే కామధేనువు వంటి భారతదేశాన్ని పిండుకున్నాగే బ్రిటిష్‌వారితో రగడ రగులుతూనే ఉందిగాని ఆరిపోవడంలేదు, స్వరాజ్యం సంపాయించే వరకు కార్యకర్తలు నిద్రపోవడంలేదు. కాస్త వంక దొరికితే అరెష్టు చేయడం బ్రిటిష్‌వారికి పరిపాటయింది. సత్యాగ్రహం ప్రారంభం కాకపూర్వమే కాంగ్రెసు కార్యకర్తలను తమాషాగా అరెష్టు చేయడం మొదలుపెట్టారు బ్రిటిషువారు. ముందు గౌతమ్‌రాయ్ గారు అరెస్టయ్యారు. వాయిదారోజు శాస్త్రిగారు కూడా వెళ్ళేవారు, గౌతమ్ విషయం కోర్టులో ఏమి జరుగుతుందో విందామని. ఒక రోజు శాస్త్రిగారి వంతు వచ్చింది. దానికి రూలు లైము లేదుకదా! కోర్టు దగ్గర శాస్త్రిగారిని అరెస్టుచేశారు. ఇక వారి కేసు వాయిదా వచ్చేసరికి కోర్టుచుట్టూ జనం వందలు మూగేవారు.

శాస్త్రిగారిని చూడటానికి కుటుంబసభ్యులుకూడ వెళ్ళేవారు. పాపం లలితాదేవికి చూడడానికి మాట్లాడడానికి కూడా వీలుండేదికాదు. కచ్చేరీకి వెళ్ళేటప్పుడు చూచేది శాస్త్రిగారిని. తీర్పు చెప్పేరోజున శాస్త్రిగారి బావ, అక్క, తల్లి అంతా వచ్చారు. లలితాదేవి నాలుగోవ్యక్తి. జైలులో ఉన్న మనిషిని చూడాలంటే కాగితం పెట్టాలి, అది మంజూరుకావాలి. శాస్త్రిగారిని చూడడానికి పెట్టుకొన్న కాగితం మంజూరయింది. ముగ్గురికంటే ఎక్కువమందికి పర్మిష నివ్వరు. అంతా కావలసినవారే. బావగారుతక్కువా? తల్లా? అక్కా? భార్యా? ఎవరు? ఇందులో త్రోసివేయదగినవారు. సమస్యే.

సనాతనధర్మాల తల్లి తప్పనిసరిగా చూడాలి. చివరికి ఎలాగైతేనేం తల్లి, అక్క, బావగార్లు చూడడానికి నిశ్చయించుకున్నారు

లలితాదేవికి శాస్త్రిగారిని చూచేభాగ్యం లేక బొటబొటా కన్నీరుకారుస్తూ జైలు ఆఫీసుకెదురుగా అరుగుమీద కూర్చున్నది. ఆ ప్రవాహాన్ని ఆపగలశక్తి ఒక్క శాస్త్రిగారికేఉంది. ఆయనకొరకేగా ఆ కన్నీటిధార, పోలీసుఆఫీసరు ఆ కన్నీటిని, ఆమె దైన్య స్థితిని చూచారు. వివరమడిగి తెలుసుకొనడానికి ఆ ఆఫీసరు ఎవరా మనిషని అడిగారుగాబోలు. విషయం తెలుసుకున్న ఆ ఆఫీసరు వెంటనే ఆమెను పిలిపించారు. శాస్త్రిగారిని కలుసుకునే అవకాశం ఆమెకు చిక్కింది. అంతటితో ఆ కన్నీటిఊట ఆగిపోయింది. అందరూ సంభాషించుకోవడం ముగిశాక లలితాదేవి కొంచెంసేపు ఆగింది. శాస్త్రిగారు భుజంమీద చేయివేసి తట్టి "విచారపడవద్దు, ధైర్యంగా వుండు"మని ఓదార్చారు.

జైలుశిక్షకేకాక శాస్త్రిగారికి జరిమానాకూడా పడింది. ఆ జరిమానా వసూలుచేయడానికి ఒకరోజు పోలీసులు శాస్త్రిగారింటికి వచ్చారు. ఇంట్లో ఎవ్వరూలేరు. అంతా గంగాస్నానానికివెళ్ళారు. ఇంటిలో ఎవరున్నారని పోలీసుఅధికారి అడిగారు. "ఎవ్వరూ లేరు అంతా గంగాస్నానానికి వెళ్ళారని" చెప్పిందొక ఆడమనిషి. మీ రెవరని అడిగారు పోలీసు ఆఫీసరు. మేము ప్రక్కయింటివాళ్ళ మని చెప్పింది. మీ భర్తపేరేమని అడిగాడు పోలీసాఫీసరు. చంద్రికాప్రసాదని చెప్పిందామె. ఇంటిలో ఉన్నారా అనిఅడిగాడు.

కాన్పూరు వెళ్లారని చెప్పింది. ఎప్పుడొస్తారు అని అడిగారు. రేపు వస్తారని చెప్పింది. మంచిది, అయితే రేపు వస్తామని పోలీసులు వెళ్లారు. లలితాదేవి అత్తగారు వచ్చినపిదప సామానంతా ఒక్క వస్తువులేకుండా గౌతమ్‌గారింటిలోకి చేర్చారు. రెండోరోజు అనుకున్నట్లుగానే పోలీసులు వచ్చారు. అయితే యింటిలో ఒక పెంకు ముక్కకూడ లేకుండాచేశారు. అందువలన ఏమీదొరకనందున వారు వెళ్ళిపోయారు.

## కసాయి వాళ్ల వేళాకోళాలు

శాస్త్రిగారిని మలకాజైలు నుంచి ఫైజాబాద్‌జైలుకు మార్చారు. ఆ విషయం వెంటనే యింటికి లేఖ వ్రాస్తూ తనకు ఐఠానీల కూర, పూరీలు తెమ్మని వ్రాశారు. అవి ఆయనగారికి యిష్టమైన పదార్థాలు. ఒక జైలు నుండి మరొక జైలుకు మారేటప్పుడు కుటుంబీకులు జైలరులను చూడ్డానికి అవకాశముంటుంది రూల్సు ప్రకారం. ఇంటిదగ్గర కావలసినవి చేయించుకు తిన్న ప్రాణాలకు కొంతకాలం జరిగేటప్పటికి జిహ్వా రుచులు కోరుతూ ఉంటుంది. ఖైదీలకు కోరింది పెట్టరుగదా! అందువల్ల ముందుగానే జాబువ్రాశారు, శాస్త్రిగారు ఇంటిభోజనం ఆరోజు తినడానికవకాశముంది. లలితాదేవి అక్కడకు వెళ్ళడానికి ఆర్థిక సమస్య ఎదురైంది. ఏమిచేయాలి? చేతిలో చిల్లిగవ్వలేదు ఎవరినడిగితే ఎవరిస్తారు? బండి చార్జి, గుర్రపుబండి బాడుగ. తినడానికేమైనా పట్టుకెళ్ళాలి. చాల చిక్కు సమస్యే! అక్కర్లు తీర్చేతల్లి ఉందిగా

అప్పురాలు గౌతంగారి భార్య. ఆమెతో చెప్పింది ఆమె రెండు రూపాయలిచ్చింది. సరే అవి ఛార్జీలకు సరిపోతాయి. ఎలాగో తిప్పలుబడి కావలసినవి సిద్ధంచేసికొని లలితాదేవి బైలుదేరింది, ఆడబిడ్డతోసహా, మలకాజైలు దగ్గరికి. జైలు వాకిలి దగ్గర ఒక గడ్డపు పోలీసు పహరా యిస్తున్నాడు. అతన్ని లలితాదేవి గుర్తించింది. ఆరోజు వేలంకోసం పోలీసు అధికారితోపాటు వచ్చింది. శాస్త్రిగారి విషయం అతన్నే అడిగారు. మొదట వారిమాట వాడు వినిపించుకోలేదు. మరలా అడిగితే కొంచంసేపు ఉండండి బైటకు వస్తారని చెప్పాడు. పాపం వారు నిజమేనని నమ్మికొని ఆదుర్దాతో ఎప్పుడు బైటకు వస్తారాయని ఎదురు చూస్తున్నారు. ఆ దాడీవాల లలితాదేవి వైపుచూచి ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. వాడి విషపునవ్వు మొదట్లో అర్థంకాలేదు. ఇక వాడి అక్కసు ఆపుకో లేక ప్రక్కనున్న పోలీసు వీరు వినేటట్లుగా — ఈమె ఎవరో తెలుసా? శ్రీమతి చంద్రికాప్రసాద్ వ్వరపు లాల్‌బహదూర్ అన్నాడు. కాంగ్రెస్ వాళ్ళు పెద్ద తెలివైనవారని మనము భ్రమ పడుతూఉంటే వారి తలలోగుండా దూరిపోయారు వారి భార్యలని చమత్కరించాడు.

వారు అలాగే వాడి మాటమీద విశ్వాసముంచి యింకా వస్తారని బహు ఆశతో కనిపెడుతున్నారు. ఎంతసేపటికీ శాస్త్రిగారు బయటికిరాలేదు. యింతలో ఎవరో ఒకాయనవచ్చి మీరు శాస్త్రిగారి తాలూకు కాదాఅని అడిగారు ఔనని బహు ఆదుర్దాగా చెప్పారు. అది ఆయన విని విస్తుపోయి తొందరగా బండి మాట్లాడుకొని

స్టేషనుకు పొమ్మనిచెప్పాడు. ఎందుకంటే వారు వచ్చేముందే శాస్త్రి గారిని స్టేషనుకు తీసుకువెళ్ళారు. వీడు బద్మాష్. మిమ్మల్ని మోసగించడానికి అలా చెప్పాడని నిందించాడు.

ఆ ఉద్యోగమే అటువంటిది. దయాదాక్షిణ్యాలతో నిమిత్తమేముంది. వారిఆదుర్దా, వారిబాధ నిజంగా అర్థంచేసుకుంటేగా వాడికి దయగల్గడానికి.

## జైలులో భర్తను కలుసుకోలేని వ్యధ

సకాలంలో భర్తను కలుసుకోవలసిన లలితాదేవి ఆ అవకాశంకాస్తా పోలీసుజవాన్ మాటనమ్మి పోగొట్టుకొంది. అసలు విషయం తెలియగానే లోపల దిగులు, విచారం ప్రారంభమైనాయి. అయ్యోదేవుడా! యింత శ్రమపడి వచ్చాము, యిక్కడ లేక పోయెను! పైగా మేము వెళ్ళేసరికి బండికాస్త కదిలిపోతే మా ఆశ నిరాశేగదా! ఏమిచేయాలి భగవంతుడా అని బాధపడుతూ వెంటనే బండీమాట్లాడుకొని గబగబా స్టేషనుకు చేరుకున్నారు.

ఒక ప్రక్కన స్టేషనులో లారీ ఆగింది ఖైదీలను చేరవేసే లారీనిచూచి కొంత అసహ్యము కొంత అవేదన పెల్లుబికింది. ఐనా దాని తప్పేముంది. నోరులేనిది. నోరున్న బ్రిటిష్ వాళ్ళదిగదా! రాక్షస కృత్యం. శాస్త్రిగారికోసం అటుయిటు వెతికారు. ఎక్కడా కనిపించలేదు. స్టేషన్ వెలుపల ఆశతో కనిపెట్టుకున్నారు. ఇంతలో పురుషోత్తమదాస్ టాండన్‌గారు ఎందుకో అటు వచ్చారు

ఏం అమ్మాయ్! శాస్త్రిగారిని కలుసుకొన్నావా అని అడిగారు. లేదన్నయ్యా! అనేసరికి అరె! బండి కదలబోతోంది తొందరగా ప్లాట్‌ఫారం మీదకు వెళ్ళమన్నారు. శాస్త్రిగారుకూడా, వారికోసం ఎంతో ఆశతో కనిపెడుతూ అటూయిటూ రెప్ప వాల్చకుండా చూస్తున్నారు. వెంటనే టాండన్‌జీకూడా ప్లాట్‌ఫారం మీదకు వచ్చారు. లలితాదేవి బండి దగ్గరకు చేరుకొనేసరికి బండి కదలనే కదిలింది.

శాస్త్రిగారు బండి నుండి గబాలున క్రిందికి దూకారు వారిని ఎక్కించడానికి. కాని ఎస్కార్ట్‌వాళ్ళకి ఆయన దూకడంతో తత్తరపుట్టింది. అరె! క్రిందకు దూకాడు, నా ఉద్యోగం కాస్తా ఊడిపోతుందని గోలపెట్టాడు. కాని శాస్త్రిగారి నిజాయితి వాడికేం తెలుసు? అందరిని బండిలో ఎక్కించి తాను బండి ఎక్కాడు. టాండన్‌గారుకూడా అదే బండిలో ఎక్కారు. శాస్త్రిగారికి యిక నెమ్మదిచిక్కి తానుకోరుకున్నవి లలితాదేవిని అడిగారు. కాని యిస్నపగజైలతల్లి వారిని వెంటాడి కాస్తుంటే వారికి డబ్బులెక్కడివి? పూరీలు, కూరలు తయారు చేయడానికి. రైలు చార్జీలే అంతంత మాత్రంగా దొరికాయి. అందువలన లలితాదేవి కళ్ళ వెంట అశ్రుబిందువులు జలజలరాలాయి. కన్నీటి ముంపుతో అసలు విషయాన్ని గ్రాహ్యం చేసుకున్నారు శాస్త్రిగారు. తనకు తెలియనిదేముంది. ఒక్క చిరునవ్వుతో ఆ ఆశను సరిపుచ్చు కొన్నారు. ఇంతలో టాండన్‌గారు వారికి అడ్డువచ్చి అమ్మాయి! మీరు తరువాత మాట్లాడు కొందురుగాని. కొన్ని ముఖ్యమైన

విషయాలున్నవి మమ్మల్ని మాట్లాడుకోనిమ్మని వారు సంభాషణ మొదలుపెట్టారు. వారి సంభాషణంతా స్వాతంత్ర్య సముపార్జన, దేశభక్తి, బ్రిటిష్‌వారిని ఎలా ఎదుర్కొనడం, ఇలాంటి విషయాలతో కొనసాగింది.

భర్త తాను పూరీలు, కూర తెస్తానని రైలు కూడుకూడ మానేశారు. ఎంత దౌర్భాగ్యురాలను. కనీసం పూరీలు చేసిపెట్టే తాహతుకూడ లేకపోయింది. పోనీ నడిచైనా వెళ్ళేవారము. ఈ డబ్బులతో యిక్కడ పూరీలన్నా కొందామంటే సైముకూడ లేకపోయింది. ఏమిచేసేది? ఇది నా దురదృష్టమని ఎంతగానో లోలోన కుమిలిపోయింది.

ఇంతలో టాండన్‌గారు షాహామాపు స్టేషన్‌లోదిగి వారికి టిక్కెట్లుకొని తెచ్చారు. ఆ మీదట శాస్త్రిగారికి ఒక ఉత్తరం వ్రాసి యిచ్చి ఎవరికో యిమ్మని వారక్కడ దిగిపోయారు. శాస్త్రిగారికి స్థాయిచిక్కగా పూరీలుతేలేని దీనిస్థితికి కుమిలిపోయే లలితాదేవిని ఓదార్చి, దేశసేవ, త్యాగం, విశ్వాసం మొదలైన విషయాలను గూర్చి వాళ్ళకు హితబోధ చేశారు. ఆమె అవి వింటూఉండగా కాలమెలా జరిగిపోయిందో తెలియలేదు. పైగా బండి వారు దిగవలసిన స్టేషనుకు రానేవచ్చింది. అది విసనాద్‌గంజ్ స్టేషను. టాండనుగారు ఎవరికైతే ఉత్తరంయిమ్మని వ్రాసియిచ్చారో వార శాస్త్రిగారికోసం ఎదురుచూస్తున్నారు. వెంటనే బండిదిగి వారు ఆర నను కలుసుకొన్నారు. శాస్త్రిగారికి పాలు, మిఠాయి మొదల

తినుబండారములు తెచ్చియిచ్చారు. బండి కదలగానే శాస్త్రిగారు బండిఎక్కి వెళ్ళిపోయారు. ఆ స్నేహితుడు లలితాదేవిగారికి భోజనం ఏర్పాటుచేసి ఆ రాత్రి వారిని బహుగా పరామర్శించి అలహాబాదువరకు వారికి రెండు టిక్కెట్లు కొనియిచ్చి ఆ రాత్రి పదిగంటలకు అలహాబాదు బండిఎక్కించి వారు శలవుపుచ్చుకున్నారు. బండి దాదాపు ఒంటిగంటకు అలహాబాదు చేరింది. బండి దిగి వారు యిల్లు చేరుకున్నారు.

శాస్త్రిగారు మలాకా జైలులోఉంటే వారు లలితాదేవికి చాలాదగ్గరలో నున్నట్లు ఏదో తృప్తి ధైర్యం ఉండేది. అంతా ఆడవాళ్ళు. ఎవ్వరూ దిక్కూమొక్కూలేరు, అత్తాకోడళ్ళిద్దరూ తినో తినకో కాలం గడుపుతున్నారు. మలాకా జైలైతే నెలకొకసారి వెళ్ళటానికి వీలుండేది. ఫైజాబాద్ చాలాదూరం. అంతదూరం వెళ్ళిచూడాలంటే చేతిలో చిల్లిగవ్వలేదు. పొట్టగడవడమే అంతంత మాత్రంగాఉంది. ఇక చార్జీలెక్కడనుండి వస్తాయి ? తన దిక్కుమాలిన తనానికి ఎంతగానో కుమిలిపోయింది. కాని శాస్త్రిగారు వచ్చేవరకూ ఆయనకోసం ఆమె బ్రతికిఉండాలి. దిగులుపడి చేసేదిలేదని గుండె రాయి చేసుకొని ఒకపూట తిని ఒకపూట తినక కొన్ని అభిరుచులు తగ్గించుకొని పైసా అణా కూడబెడితే ఆరు మాసాలకు ఫైజాబాద్ పోవడానికి చార్జీలు పిగలడం అంతంత మాత్రమయ్యింది.

అలహాబాదులో చాలామంది సత్యాగ్రహులు అరెస్టయినారు. వారందరు అదే జైలుకు పంపబడ్డారు. వారి భార్యలు నెలకొకసారి

ఫైజాబాదు వెళ్ళి తమ భర్తలను చూచివస్తున్నారు. తనకాభాగ్యం లేదని తన పేదస్థితికి ఎంతో కుమిలిపోయింది. ఎవరినైనా అప్పడుగు దామా. యిస్తారు కాని తీర్చేవిధానమేది? ఇన్నివిధాల ఆలోచించి పైసా, అణా కూడపెడితే ఆరుమాసాలకు తన ఆశయం నెరవేరే అవకాశం చిక్కింది. ఆ సమయములో కేసిప్‌దేప్‌మాల్యా, గౌతమ్ గారిభార్యలు తమ భర్తలను చూడడానికి బైలుదేరారు. వారితో పాటు లలితాదేవికూడా ఫైజాబాద్‌కు బైలుదేరింది.

శాస్త్రిగారికి మామిడిపండ్లంటే చాలా యిష్టం. నిజంగా భర్త అభిరుచులు భార్యకు, భార్య అభిరుచులు భర్తకు తెలిసే ఉంటాయి. కాలఖర్మాన ఇలాంటి ఎడబాట్లు దంపతులకుకలిగితే వారి అభిరుచులు మనసులోమెదిలి, వారిని కలుసుకోడానికి అవకాశం చిక్కినప్పుడు అవి అందజేస్తుంటారు. అలాగే శాస్త్రిగారికి ఏ సీజనులో ఎటువంటి పండ్లు యిష్టమో తనకు బాగా తెలుసు. అది మామిడికాయల సీజను. అవంటే శాస్త్రిగారికి చాలాయిష్టమనితెలిసి జైలులో ఏమితింటున్నారో, ఏమి త్రాగుతున్నారో అని విచారపడి తన శక్తికొలది రెండు మామిడిపండ్లుకొని పైటకొంగుచాటున పెట్టుకొని జైలులోపల ప్రవేశించి శాస్త్రిగారిముందు పెట్టిందా రెండు మామిడిపండ్లు. ఏమిటీపని అని శాస్త్రిగారు లలితాదేవిగారిమీద గుడ్లెర్రజేశారు. పైగా దొంగచాటుగా యీ మామిడిపండ్లు తెచ్చావని పోలీసుల కప్పజెప్పుతానని కేకలేశారు. ఎంత నిజాయితీపరుడు. నిజంగా ఆపని జైలు నియమాలకు వ్యతిరేకం. అలాచేయకూడదు. సత్యసంధతే ఆయనకు కావలసింది. ఇంకొకరయితే ఈ పళ్లు ఎన్నొ

శ్యకు దొరికినవి. ఇవి నాకు చాలా యిష్టమైనపండ్లని గుర్తించి తెచ్చితివని మురిసిపోయి భార్యకు తనమీదున్న అభిమానానికి అభినందించి గుట్టుదెలియకుండా మ్రింగి ఊరుకునేవారు. అలాకాకుండా శాస్త్రిగారు పోలీసులకు అప్పజెప్పుతానని ఆగ్రహండైనాడు.

చేయునదిలేక లలితాదేవి దుఃఖాన్ని దిగమ్రింగి ఏమిరా తండ్రీ! రాకరాక ఆరుమాసాలకు కాలుకదుపుకొనివస్తే ఇదా నాకు ప్రాయశ్చిత్తం. ఆరుమాసాలకు నా భార్యనుచూచానన్న సంతోషమే లేకుండా మండిపడుతున్నారని లోలోపల వ్యధపడి పల్లెత్తి మాటన లేదు.

భర్తగారిని కలుకొనుసున్నాను. ఏమేమో మాట్లాడుదామని ఉబలాటపడ్డాను. నా ఆశ నిరాశయ్యింది. జైలు నియమాలను ఎంత కఠినంగా పాటిస్తున్నారు అని ఆశ్చర్యపడింది. మాలవ్యాగారిభార్య వక్కలుతెచ్చింది. అక్కడేమీ అల్లరి జరుగలేదు. గంటసేపు నిలబడింది. ఏమీ మాట్లాడలేదు. తల్లివిషయం కాబోలు అడిగితే బాగుందని సమాధానమిచ్చింది. టయిమయిపోయింది. మామిడి పండ్లు యిచ్చివేశాడు. గౌతమ్‌గారు ఖైదీలకిద్దామని ఆ రెండుపళ్ళూ తీసుకున్నారు.

# తనకు మించిన దానధర్మము

లలితాదేవి ఫైజాబాదు నుండి తిరిగి అలహాబాదు చేరుకొన్నది పుట్టెడు దిగులుతో. అదే ధ్యాస అదే ధ్యానం. ఏమి

తింటున్నారో ఏమి త్రాగుతున్నారోనని. ఐదోనాడు శాస్త్రిగారినుండి ఉత్తరం రానేవచ్చింది. సంబరంతో విప్పిచూచింది. మామిడి కాయల సంఘటన ఆయన మరచిపోలేదు. ఎంత నిర్మల హృదయముగల మనిషి. అలా దొంగబుద్ధులుంటే తనకా కష్టాలు దేనికి. నిస్వార్థ పరుడు, అందులో మామిడికాయలను గురించి నీమీద ఊహాగా కోప్పడ్డాను. క్షమించమని ఆ ఉత్తరంలో క్షమాపణ కోరారు

శీతాకాలం ప్రవేశించి ఎముకలు కొరికే చలి. శాస్త్రిగారి లేఖ ప్రకారము ఆయన రావడానికి యింకా పదిరోజులే గడువుంది. మనసు ఉల్లాసంగాఉంది. రోజులు లెక్క పెట్టుకొంటున్నారు అత్తా కోడళ్ళు. ఆరోజు ఆదివారం. చీకటిపడింది. లైట్లు వెలిగిస్తోంది లలితాదేవి. ఎందుకో అత్తగారు ఆ సమయములో రెండు భజన కీర్తనలు పాడమని కోడల్ని కోరింది లలితాదేవి "ఆరహేవన్ సే రఘునందన్" పాట పాడింది మనసు మాత్రం శాస్త్రిగారి దగ్గరికే పరిగెత్తింది అయినా వచనాలు పొల్లుపోలేదు. పాటపూర్తయ్యే లోపల గుఱ్ఱపుబండి ఒకటి యింటిముందు ఆగింది. శాస్త్రిగారు బండి దిగి లోపలికి వచ్చారు. లలితాదేవి పరుగెత్తుకొనివెళ్ళి భర్త కాళ్ళపైబడి నమస్కరించింది. శరీమంతా ఒణికింది. ఆ దడచూచి దొంగ ఎవడైన వచ్చాడేమోనని ఎవరు? అని అడిగింది. చూస్తే కుమారుడు. బిడ్డను చూచి పరవశురాలై పోయింది.

శాస్త్రిగారు జైలుజీవితములో సన్నబడిపోయారు. మనసు నెమ్మదిలేని తిండి. మనసు నెమ్మదిఉంటేనే శరీరం ఆరోగ్యంగా

ఉండేది. తనకిచ్చిన మామిడిపళ్ళ ప్రస్తావనవచ్చి జైలువానికిచ్చిన సంగతి చెప్పారు. వాడు ఆజన్మఖైదీ. వాడు మామిడిపండ్లుతిని 20 సంవత్సరాలయిందట. పాపం వాడు వాటి రుచి మరచిపోయాడట. బైటుంటేగా ఏదైనాతినడానికి. పాపం వాడి కాలఖర్మంఅది.

ఎన్నికష్టాలు, ఎన్ని అగచాట్లు అనుభవించినా తమాషాలు చేయడంలో తక్కువేమీకాదు శాస్త్రిగారు. అలా ఉండబట్టే దార్యాభర్తల అనురాగం విసుక్కున్నా కసుక్కున్నా విడదీయరానిదిగా ఉంటుంది.

ఒకరోజు ఎవరో తలుపుతట్టాడు. శాస్త్రిగారు ఆ సమయంలో ఇంట్లో లేరు. శాస్త్రిగారు తలుపుతట్టడంవేరు, ఆ కదలికవేరు. ఆ విషయమంతా లలితాదేవికి ఆకలింపే. నెమ్మదిగావెళ్ళి తలుపు తెరిచింది. ఆ క్రొత్తమనిషినిచూచి గాభరాపడిపోయి, త్వరత్వరగా మెట్లెక్కడం ప్రారంభించింది. ఆయన వెంటనే మెట్లుఎక్కుతూ మెట్లమీద కర్రతోకొడుతూ పైకి వారివెంట వెళ్ళాడు. లలితాదేవి గడగడా ఒణకడం ప్రారంభించింది. అత్తగారు ఆ తత్తరపాటు చూచి ఏమిటేఅని అడిగింది. తీరాచూస్తే కుమారుడు. ఆయన స్కాట్‌డ్రస్‌లో ఉండడంచూచి యిద్దరూ గుర్తుపట్టలేకపోయారు. ఆ దుస్తులలో శాస్త్రిగారినెప్పుడూ చూచియుండలేదు లలితాదేవి, అందువలన ఏ పోలీసోనని కంగారుపడింది.

ఇక తల్లిగారు వడ్డింపు ప్రారంభించింది. ఇదేమిటిరా కోడల్ని భయపెట్టావని. ఆ ఏంలేదు, ఎంత ధైర్యంగల కోడలో ఈవిడ

అనిపరీక్ష చేశాను అంతేనని నవ్వుతూ అన్నారు. అదివిని వాళ్ళంతా విరగబడి నవ్వారు.

కుసుమ్‌కు అప్పటికి ఐదేండ్లు నిండుతూ ఉన్నాయి. ఆ వయసులో ఆ బిడ్డ చెప్పరాని కోరికలు కోరేది. బొమ్మలు, ఐస్‌క్రీంలు, మిఠాయిలు కావాలని కోరేది. లేమి కాపురము. ప్రతీది కొనాలంటే శక్తి చాలదు. ఉన్నదానిలో సరిపెట్టుకొంటూ కాలం గడపడమాయె పసిబిడ్డలకేమి తెలుసు. ఏనుగును తెచ్చి ఏకులబుట్టలో యిమడ్చమంటారు. పిల్లలు పోరుపెడితే ఆపడం చావే. తల్లికి ఓదార్చడానికి పెద్ద సహనం కావాలి. ఏం సహనముంటుంది ఉదయం మొదలుకొని సాయంకాలం వరకు ఒకటే చాకిరి.

అంతేకాక వంట చేయడానికి వెళ్తే ఉప్పుంటే పప్పుండదు పప్పుంటే ఉప్పుండదు. అవి సర్దిసర్ది చేయాలంటే తల ప్రాణం తోక్కి వస్తుంది, అలా అలసిపోయిన తల్లి కాలు మడిచి కూర్చుందామంటే పసిబిడ్డలు ఒళ్ళోచేరి లేనిపోని మారాం చేస్తారు మిఠాయో కారబ్బూందో కావాలంటే ఎక్కడినుండి వస్తుంది.

ఒకసారి కుసుమ్ ఏదో కావాలని గొడవ పెట్టింది. ఎంతగానో బుజ్జగించింది తల్లి. తన సహసమంతా నేర్పుతో ప్రయోగించింది. కాని కుసుమ్ ఆగలేదు. ఇకసహనాన్ని కోల్పోయి నాలుగు బాది వదిలింది. కాని కుసుమ్ మంకు తనం ఆగలేదు. చివరికి విసిగి వేసారిపోయి అణా మిఠాయి కొనియిస్తే తిని నిద్రపోయింది. సాయంత్రానికి భర్త వచ్చారు. తాను చేసిన పనికి

తానే పశ్చాత్తాప పడింది. లోలోపల బాధను అణచివేసింది కాని విషయం భర్తకు చెప్పకుండా ఉండలేక పోయింది. నేను ఒకతప్పు చేశానని భర్తతో చెప్పింది ఏమిటని శాస్త్రిగారు అడిగారు. కుసుమ్ గోలచేస్తే ఒక అణా ఖర్చుపెట్టి మిఠాయి కొన్నానని చెప్పింది. ఆ మాటతోనే అంతా ఊహించి మంచిపని చేశావు పిల్లలను కొట్టి అపగలమా? అని అన్నారు. శాస్త్రిగారు ఇంట్లో ఉండగానే ఐస్ క్రీము వాడొచ్చాడు. వాడు పిల్లలు వినేట్లుగా పెద్దగా కేకలు వేస్తాడు. వాణ్ణి త్వరగా వెళ్ళమని శాస్త్రిగారు కోరారు. అందుకు వాడు "వెళ్తే అవి తొందరగా ఖర్చయ్యేదెలాగ?" అని పలికి పెద్దగాకేకలు వేస్తూ వెళ్ళాడు. ఆ కేక కుసుమ్ విన్నది. వెంటనే ఐస్‌క్రీమ్ కావాలన్నది. శాస్త్రిగారు బహుగా బుజ్జగించారు. కాని రోజుకు పైసా చొప్పున మంజూరు చేశారు. పైసా అంటే యిప్పటి నయాపైసాగాదు.

## గోరుచుట్టుపై రోకటిపోటు

ఆ స్వాతంత్ర్య సమరోద్యమములో కాంగ్రెసువారిపని దినదిన గండం నూరేళ్లాయుస్సుగా ఉండేది. ఏ క్షణాన ఏమి జరుగుతుందనేగా బాధ. మరల శాస్త్రిగారిని అరెస్టుచేశారు. మలాకజైలుకు ముందుపంపి తరువాత ఫైజాబాదు జైలుకు మార్చారు అందువలన వారితోబాటు అత్తాకోడళ్ళు శాస్త్రిగారివెంట ఫైజాబాదు వెళ్లారు. తల్లితోజెప్పి దారిలో జిలేబీ కొనిపించారు. అందరూ తలాకాస్త తీసికొన్నారు. లలితాదేవి వద్దన్నా బలవంతాన తినిపించారు. అప్పుడుచెప్పారు అసలురహస్యం, ఫైజాబాద్‌లో భోజనం దొరక

దని. ఫైజాబాద్‌లో వారికి బంధువులున్నారుగాని యిలాంటి పరిస్థితులలో వెళ్ళగూడదని వారికి బాగా తెలుసు.

శాస్త్రిగారు జైలుశిక్షముగిశాక యింటికి వచ్చేశారు. ఆయన యింటికి తిరిగివచ్చిన తరువాత బహదూర్‌గంజ్ యిల్లు వదిలేసి ఈద్‌గాహీరోడ్‌లో యిల్లు అద్దెకుతీసుకున్నారు. పాపం ఆ రోజుల్లో శాస్త్రిగారి బావమరది పోయారు. అప్పటికి చెల్లెలికి పెండ్లయి ఎనిమిది సంవత్సరాలు మాత్రమే. అప్పటికి ఆమెకి 27 రోజుల మగబిడ్డ. అంతకుముందే పెద్దగాఎదిగిన ఆడపిల్ల మరణించింది. అందువలన ఆమెకూడ శాస్త్రిగారితోనే ఉంటున్నది. విధిని ఎవ్వరూ తప్పించలేరుగదా! కష్టాలు పేదలకే అధికం. అందుచే తలిదండ్రులు పోయి దిక్కులేనివారౌతారు. అట్టి బిడ్డల బ్రతుకులు వర్ణనాతీతం. వేదాంతులు ఈ విషయాన్ని ఎలా సరిపెట్టుకుంటారోగాని దైవానికి చాల పక్షపాతముందనే చెప్పాలి. వారుతీసుకున్న యింటి క్రింది భాగములో సరజూప్రసాద్‌గారి కుటుంబం అద్దెకుంటున్నది.

ఒకనాడు ఎవ్వరూలేకుండాచూచి దొంగ జొరబడ్డాడు. శాస్త్రిగారు కాంగ్రెస్‌పనిమీద వెళ్లారు. తల్లీచూతుళ్ళిద్దరూ రాయనగరం వెళ్లారు. సరజూప్రసాద్ ఆయనగారిభార్య ఎక్కడికో వెళ్లారు. యింటిలో లలితాదేవి, కుసుమ్, తరువాత సుమన్, హరిఅనేపిల్లలు తనతో ఉన్నారు. రాత్రి 9 గంటలకు భోజనాలు పూర్తిచేశారు. బయటితలుపు వేద్దామని లలితాదేవి వెళ్ళింది. అ చీకటిలో ఎవడో నిలబడిఉన్నాడు. గుండె ఆగినంత పనయింది.

ఒంటరిగా నున్నప్పుడు అలాంటి ఘట్టాలనుండి బైటపడా లంటే తెలివితేట లవసరం. బహుసమయోచితంగా మెలగాలి అది అందరికీ తట్టదు. లలితాదేవి గుండె నిబ్బరం చేసికొని వాడు వినే టట్లు పెద్దగా "సరజూప్రసాదుగారూ" అనేకేకవేసి మేము పండుకో వడానికి పైకి వెళ్తున్నాము. క్రింద తలుపులు వేసుకోమని అక్కడ వారు ఉన్నట్లే చెప్పింది. సరజూప్రసాద్‌గారు నిజంగానే అక్కడ ఉన్నాడనుకొని దొంగ కాలికి బుద్ధి చెప్పాడు. ఐతే వాడు ఎంత తత్తరపడ్డా వాడిపనిమాత్రం వాడు మర్చిపోకుండా లాభ యుక్తంగానే శాస్త్రిగారి మడతకుర్చీ తీసుకొని ఉడాయించాడు.

కాపురాలు కొద్దివైనా కొంతమంది గృహిణులు ఉన్న దానిలో తమ యిల్లు నీటుగా ఉంచుకుంటారు కొంతమందికి పని తెమలక ఎక్కడి వస్తువులు అక్కడే జారవిడిచి పనులు చేసు కుంటూ పోతుఉంటారు ఆ వైఖరి నచ్చని మగవాళ్ళు చెడామడా కేకలువేసి పిల్లలను సమదాయించు కొంటున్నా భార్యను పిలిచి యిల్లు సర్దించేవారున్నారు.

మన శాస్త్రిగారు ఉత్తమ కోవకు చెందినవారు. కష్టసుఖాలు ఎరిగిన మనిషి. అమిత నిజాయితీపరుడు. పిల్లలున్న యిల్లు చిందరవందరగా ఉంటుందని ఆకళింపే. అందులో చదువుకొనే పిల్లలు పుస్తకాలు, వస్తువులూ ఎక్కడబడితే అక్కడ పార వేస్తారు. కుసుమ్ ఆరోజుల్లో చదువుకొంటుంది. ఆమె పుస్తకాలు ఎక్కడబడితే అక్కడ పారవేయడం అలవాటు. ఏ వస్తువూ

క్రమంగా ఉంచుకోరు. పనిలో నిమగ్నమైఉన్న యిల్లాలునుచూచి జాలిపడి యింట్లో ఉన్న సామాను సర్దిపెడతారేగాని, పిల్లలమీద కోప్పడడంగాని బెదిరించడంగాని చేయరు శాస్త్రిగారు. ఒకవేళ యేడిస్తే ఓదార్చడం చేతగాక అమ్మదగ్గరకు పొమ్మని చెపుతారు. ఒకరోజు కుసుమ్ అల్లరి చేసింది. శాస్త్రిగారికి కోపంవచ్చి విసెన కర్రతో కుసుమ్‌ని ఒకదెబ్బ కొట్టారు అదివిని లలితాదేవి గబ గబ పైకి పరుగెత్తింది. కుసుమ్ ఏడుస్తూఉంది. చూచేసరికి శాస్త్రి గారి చేతిలో విసెనకర్ర ఉంది శాస్త్రిగారిని ఏమీ అనలేక కోపంతో కుసుమ్‌ని క్రిందకు పంపింది. తాను భర్తవంక కోపంగాచూచి క్రిందకి దిగుతూఉంటే అదిచూచి "నీవు నాకంటే ఎక్కువ కొడతావే పిల్లల్ని నేను విసెనకర్రతోనేగా ఒకదెబ్బకొట్టింది ఆమాత్రానికే మొహం అలా పెట్టావేం?" అనిఅన్నారు.

## దినదిన గండము

కొంతమందికి కొన్నికొన్ని అలవాట్లు సహజంగా ఉంటాయి అవి ఎంత ప్రయత్నించినా ఆపుకోలేరు. కొందరు ఉదయాన ముఖం కడుగకుండా ఎంతసేపైనా ఉంటారు కడిగినతరువాత కడుపులో ఏదోఒకటి పడాలి. లేకపోతే ఆకలి తపనకు ఆగలేరు. మన శాస్త్రిగారికి ఒక అలవాటుంది. భోజనానికి కూర్చున్న పిదప వడ్డించడం ఆలస్యమైతే సహించలేరు. ఎందుకంటే పెద్దవారికి అన్నం తినడానికికూడా సమయముండదు. అన్నంతినాలనే మిషతో ఆ పనులు కట్టిపెట్టుకొని మరీ భోజనానికి కూర్చుంటారు. అందు వలన శాస్త్రిగారు కూర్చున్న పిదప వడ్డణ ఆలశ్యమైతే సహించరు.

ఒకరోజు ఎక్కడికో అర్జెంటుగా వెళ్ళాలని వంట సిద్ధం చేయమన్నారు. అందువలన లలితాదేవి పనులన్నీ చక్కబెట్టుకొని గబగబా వంట తయారుచేసింది. వంటంతా అయిందిగాని ఇక రొట్టెలుమాత్రం కాల్చాలి. ఇంతలో హరి మెట్లమీదినుండి దొర్లి క్రిందబడ్డాడు. క్రిందపడడం సామాన్యవిషయంకాదు పసిబిడ్డలు మంచంమీదనుండి పడితేనే ఎంతో ప్రమాదం. హరి మెట్లమీది నుండి క్రిందపడ్డాడు. కుసుమ్ చెప్పమని కేకపెట్టింది. హడావుడిగా పరిగెత్తింది లలితాదేవి. ఆ తొందరలో పిల్లవాడు తన కాలిక్రింద పడ్డాడు. చుట్టుప్రక్కల జనం ప్రోగైనారు. వారికి తోచినవైద్యం చేసి ఓదార్చారు. పిల్లవాని నోటివెంట, ముక్కువెంట రక్తం కారింది. పిల్లవాడు దానితో సొమ్మసిల్లిపోయాడు. పసిపిల్లలు ఎంతలావు దెబ్బలకైనా తట్టుకుంటారు. ఆటకాయితనం, ఏమీ తెలియదు. ఒళ్ళంతా గాయాలే. ఆ మీదట సొక్కి నిద్రపోయాడు.

ఇంతలో శాస్త్రిగారు వచ్చారు. అప్పుడే పిల్లవానిని సర్దుకొని రొట్టెలుచేయడం ప్రారంభించింది లలితాదేవి. నేను ఎప్పుడో చెప్పి పోయానుగదా వంటచెయమని. ఇప్పటిదాకా ఏమి అఘోరిస్తున్నావని మండిపడ్డారు శాస్త్రిగారు. పాపం శాస్త్రిగారికి జరిగినవిషయం తెలియదు. వెంటనే విషయమంతా చెప్పేసింది. బిడ్డను ఆదుర్దాగా చూచి హృదయం ద్రవించిపోయి, అమాంతం బిడ్డను భుజానవేసి కొని డాక్టరుదగ్గరకు పరుగెత్తి చికిత్స చేయించుకొని, తిరిగివచ్చి జరిగిన తప్పుకు క్షమించమని లలితాదేవిని ప్రాధేయపడ్డారు. నిజంగా వారిలాగా భార్యాభర్తలు ఒకరితప్పును ఒకరు అర్థంచేసుకొని మెలిగితే ఆ సంసారం స్వర్గతుల్యమే.

లలితాదేవికి బాగా చదువురాదు. బళ్లో చేర్పించిన మొదటి సంవత్సరమే తండ్రిగారు చనిపోవుటవలన చదువు అచ్చిరాలేదని తల్లిగారు చదువుకు స్వస్తిచెప్పించినసంగతి మనమెరిగిందే. ఇంటివద్ద శ్రద్ధతో నేర్చుకొన్న చదువేతప్ప వేరే డిగ్రీలు లేవు. ఉన్నవారికి విద్య అబ్బడం చాలా కష్టం లేనివారికి విద్య అంతలో అబ్బు తుంది దానికి కారణం దైవనిర్ణయమనే చెప్పాలి. తెలివితేట లున్నవారికి డబ్బుండదు. డబ్బున్నవారికి తెలివుండదు. బద్ధకం జాస్తి. తెలివివున్నా పేద కుటుంబీకులైన మన శాస్త్రిగారి కుటుం బానికి విద్య నభ్యసించడం గడ్డుగానే జరిగింది. లలితాదేవి విద్య తండ్రిలేని కారణాన కుంటుపడింది.

ఆ వయసులో తన విద్యను అభివృద్ధి చేసుకోవాలని లలితాదేవికి ఆశకల్గింది. అప్పటికి తనకున్న విద్యతో రామాయణం మాత్రం బాగా చదువకల్గేది. అదే ఆమెయోగ్యత. ఈద్‌గాహ్ ఇంటికి వెళ్ళాకా లలితాదేవి చదువు మొదలుపెట్టింది. తన ప్రయత్నానికితోడు ఒక మంచి అవకాశం కలిసివచ్చింది. వారి యింటికెదురుగా ఒక బెంగాలీ అమ్మాయి కాలేజీలో చదువుతూ ఉండేది. ఆ అమ్మాయి లలితాదేవి గురువు. ఇంట్లో పనిమనిషిని మాన్పించేసి తానే స్వయంగా పనులు నిర్వర్తిస్తూ అలా పొదుపు చేసినడబ్బుతో విద్య నభ్యసించడానికి ఉద్యమించింది. కాని ఆమె అనారోగ్య పరిస్థితులనుబట్టి శాస్త్రిగారు ఒప్పుకోలేదు. అయినా తనపట్టుదలతో శాస్త్రిగారు అంగీకరింపక తప్పలేదు.

వారి బ్రతుకులో 15 రోజులు వెన్నెలగా సాగుతూఉంది కారణం సంసారములోని సౌఖ్యాన్ని వెన్నెలలాగా అనుభవిద్దామంటే కొంతకాలమూజైలు ప్రవాసం తప్పడంలేదు. శాస్త్రిగారు మరలా జైలుకెళ్ళేరు ఈసారి ఉన్నావ్ జైలుకు పంపించారు. జైలుకి వెళ్ళే ముందు శాస్త్రిగారు గుడ్డలో ఏదో చుట్టి లలితాదేవి చేతికిచ్చారు. విప్పిచూస్తే ఉత్తరం తల్లిగారు చూడగూడదని తన ఉద్దేశం. ఎలాగైతేనేం తల్లిగారు ఆ విషయం పసిగట్టనేగట్టింది.

ఇంటి కొచ్చిన తరువాత లలితాదేవి అత్తగారు ఆడబిడ్డతో చెప్పి బచవా ఏమేమి వ్రాశాడో అడిగి తెలిసికోమంది కోడల్ని. ఆడబిడ్డ అత్తగారి ఆదేశం ప్రకారం అడగనే అడిగింది. లలితాదేవి చెప్పడానికి సంకోచించింది. అయినా చెప్పక తప్పలేదు. ఆ విషయంలో తల్లికూతుళ్ళిద్దరూ ఏవేవో ఊహలు అల్లుకొన్నారు. ఆఖరికి ఉత్తరం యిచ్చివేసింది తీరా ఉత్తరం విప్పిచూస్తే ఆడబిడ్డను బాగా చూడమనిఉంది. ఆమె కంటతడిబెడితే మనకు జయములేదని వ్రాశారు. తన సోదరుడు ఎంతఉదారుడో తన కప్పుడు అర్థమైంది. తన దీనస్థితికి తన సోదరుని అవ్యాజమైన ప్రేమకు కుటుంబ సంకట పరిస్థితులను తలచుకొని బొటబొట కన్నీరుకార్చింది. తనతల్లికి ఎట్టి కష్టంకలుగకుండ చూడమనికూడా వ్రాశారు. ఎంతటి నిష్కల్మష హృదయులు శాస్త్రిజీ.

## దేశసేవే తన పరమార్థం

శాస్త్రిగారు మరలా చీకటిలోనుండి వెలుగులోనికి వచ్చారు. తరువాత మకాం లక్నోకు మార్చారు. కష్టాలతో, కడగండ్లతో

కూడుకొన్న జీవితం. విశ్రాంతి ఎక్కడిది? సుఖమెక్కడిది? ఒక్క అరగంటసేపు తండ్రిగారు బిడ్డదగ్గర కూర్చొనడానికి తీరుబడి లేదు, బిడ్డ చావుబ్రతుకుల్లోఉంది. రోజులురేక చచ్చేది కొంత మంది. ఈ బ్రతుకే ఒక మాయ. శాస్త్రిగారు యింత ఆపదలో కూడ బిడ్డదగ్గర అరగంటకాలం గడుపకుండా ఉన్నందుకు లలితాదేవి విసిగి "బిడ్డమీదకూడ మీకు బాధ్యత ఉండ"దని కష్టంగా అంది. "24 గంటలు నీవు దగ్గరున్నందున నీకు ప్రేమ ఉన్నట్టు, దగ్గర లేనందున నాకు ప్రేమలేనట్లనా నీ భావ"మని ఆయన అన్నారు. అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడని నచ్చచెప్పి తనపనులు తాను చక్కబెట్టుకొంటూనే ఉన్నారు. ఇంతలో బిడ్డ పోనేపోయింది.

ఆడబిడ్డ పోయినందుకు ఆ దంపతులు ఎంతగా దుఃఖించారో చెప్పడానికే ఫీలులేదు. బిడ్డ జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా కంటినీరు పెట్టేవారు. బిడ్డమీద చక్కని పాటకూడా వ్రాశారు.

లక్నోలో కొద్దిరోజులున్న పిదప శాస్త్రిగారు అలహాబాదు వెళ్ళవలసి వచ్చింది. వారికి సౌత్‌మలాకాలో యిల్లుదొరికింది. అక్కడ నివాసం ప్రారంభించారు.

లలితాదేవికి పెండ్లయిన తరువాత వంటచేయడము ఒక సమస్యగా తయారైంది. మట్టిపొయ్యిమీద వంటచేయడంవల్ల సంవత్సరం లోపల యింట్లో ఎవరోఒకరు చస్తారని రామాపురంవారి విశ్వాసం. అందువలన తాను కుంపటిమీద వంట చేయవలసి వచ్చేది. ఆ పొయ్యిమీద సెగ సరీగ్గా తగలక ఒకరోజు పప్పు

మాడిపోవడం. మరొకసారి కూర కాటుపోవడం, అదీయిదీ కాకపోతే చెయ్యైనా కాలడం జరిగేది. అందువలన ఏదైనా క్రొత్త పద్ధతితో పొయ్యి సరిదిద్దుదామా అత్తగారు ఒప్పుకోదు.

ఏమైనాకానిమ్మని భగవంతునిమీద భారంవేసి, అత్తగారు లేకుండాచూచి మట్టిపొయ్యి తయారుచేసి, దానిమీద పకోడీలువండి తానే తిన్నది. అంటే చనిపోతే తానే చనిపోతాను, ఎవరిప్రాణానికి ముప్పుండదని తన భావన. ఆ వంటఅయ్యాక ఆ పొయ్యితీసి దాచి భగవంతుణ్ణి ప్రార్థించడం మొదలుపెట్టింది. ఎవరికి ఏమి అపకారం జరుగనియవద్దని.

సంవత్సరమైంది. మట్టిపొయ్యిరహస్యం అత్తగారికిచెప్పింది. ఆమె ఆశ్చర్యపడింది. పాపం వారి మూఢనమ్మక మేగాని ఏమిజరుగలేదు. కనుక అసలుసంగతి బైటపెట్టింది. ఆ మీదట మట్టిపొయ్యి పెట్టుకోవడానికి లలితాదేవికి పర్మిషను గ్రాంటయ్యింది. ఇంకొక మూఢనమ్మకముంది. వడియాలవిషయములోగాక నూనె, ఊరగాయల విషయంలోకూడ అటువంటిదే అనుమానం. ఊర గాయల జాడీ అటకమీద పెట్టింది.

ఒకరోజు శాస్త్రిగారు కాంగ్రెస్ పనిమీద బెనారస్ వెళ్లారు. ఆయన అనుకొన్నరోజుకు రాలేదు. లలితాదేవికి అనుమానం కలి గింది. ఏకాదశిరోజు శాస్త్రిగారి ఆరోగ్యం బాగుగాలేదని కృష్ణ పేరుమీద టెలిగ్రాంవచ్చింది. జాడీ అటకమీదనుండి తీసి బజార్లో పారబోసింది. ఎందుకంటే నూనెతోకూడిన ఊరగాయ అనర్థకమని

కాటోలు. ఒక్కొక్క ప్రాంతంవారి అలవాట్లు అలాంటివి. అనుమానం పెనుభూతముగదా! ఆంధ్రాలో రకరకాల పచ్చళ్ళజాడీలు యింటినిండా మూలుగుతాయి. ఒక్కొక్కరిళ్ళల్లో మూడేళ్ళనాటి పచ్చళ్లుకూడ దొరుకుతాయి. వాళ్ళ అనుమానమది. పాపం యీ వార్తవిని ఊరగాయలజాడీ బజార్లో కుమ్మరించింది లలితాదేవి. లలితాదేవికి భర్తమీద చాల అనురాగం. తన భర్తప్రాణాన్ని తన ప్రాణంగా చూచుకుంటుందా యిల్లాలు.

కృష్ణ, శాస్త్రిగారిని చూడడానికి బెనారస్ వెళ్ళాడు. వెళ్ళిన వెంటనే పరిస్థితి ఎలాఉందో తంతి పంపమని లలితాదేవి కోరింది. వెళ్ళాడేగాని కృష్ణ తంతి పంపలేదు, కనీసం ఉత్తరంకూడా వ్రాయ లేదు ఆందోళన అధికమైంది. వెళ్ళిచూద్దామా చేతిలోపైసాలేదు. రెండో పరిస్థితి పిల్లలు తనదగ్గర లేకపోవడం. సరజూప్రసాద్ గారు పిల్లలను వారింటికి సరదాగా ఊరు తీసికెళ్ళారు. అందువలన తానాగి అత్తగారిని పంపించింది.

## గండంగడిచింది

ఒక్కొక్కరు చక్కని కలలు కంటూఉంటారు. కొంత మందికి భయంకరమైన కలలువచ్చి నిద్దరలోనే తత్తరపోతారు. లలితాదేవికి ఆ పరిస్థితులలో ఒక విచిత్రమైన కలవచ్చింది ఒక తెల్లని గుఱ్ఱంమీద ఒక దాడీవాలా శాస్త్రిగారి యింటికి వచ్చారట. గుఱ్ఱం యింటిముందు ఆగింది. శాస్త్రీగారు గుఱ్ఱాన్నిదిగి యింట్లోకి వచ్చి, నేను వెళ్తున్నాను, జాగ్రత్తని చెప్పారు. చెప్పి గుర్రంమీద

ఎక్కి కూర్చున్నారు. లలితాదేవి గుఱ్ఱం తోక పట్టుకొని వదల మన్నా వదలలేదట. శాస్త్రిగారు ఆమె బాధచూచి గడ్డపు వ్యక్తితో యికనేను రానని గుఱ్ఱం దిగారట. దాడీవాలా ఏమీ మాట్లాడ లేదట. ఇంతలో మెళుకువవచ్చి త్రుళ్ళిపడి లేచింది. తీరా చూస్తే కల.

మరనాడు సరుజూప్రసాద్‌గారు పిల్లల్ని తీసికొని వచ్చారు. లలితాదేవి టాండన్‌గారి వద్దకు వెళ్ళి రిప్లైయ్‌పెయిడ్ టెలిగ్రాం యిచ్చారు జవాబు రాలేదు. గుండెల్లో దడ ఎక్కువైంది. రెండో రోజు టాండన్‌గారు సౌత్‌మలాకా వచ్చి లలితాదేవిని కలుసుకొని విషయం తెలిసికొన్నారు. లలితాదేవి బెనారస్ వెళ్ళడానికి సిద్ధ పడింది. ఈ విషయం తెలిసికొని హరి అమ్మగనుక నన్ను బెనారస్ తీసికొని వెళ్ళకపోతే నేను కోడిగ్రుడ్డుతిని మునల్మాను నైపోతానని బెదిరించాడు. అదివిని టాండన్‌గారు హరిని ఒళ్ళో కూర్చోబెట్టుకొని బుజ్జగిస్తూ కోడిగ్రుడ్డు తిన్నంత మాత్రాన మునల్మానువు కావని చెప్పారు. మూడోరోజు బెనారస్ వెళ్ళ డానికి లలితాదేవి సిద్ధమైంది.

ఇంతలో కృష్ణ బెనారస్‌నుండి తిరిగివచ్చి ఇక బెనారస్ వెళ్ళడం అనవసరమని అన్నారు. ఆపదలో ఒక్కొక్కరికి వర్త మానాలు ఎలాచెప్పాలో తెలియదు. చావుకబురు ఉన్నఫళంగా చెబితే కొంతమందికి గుండె ఆగిపోతుంది, కృష్ణ యిక వెళ్ళడం అనేదానిలో అనేక అర్థాలున్నవి. ఆయన ధోరణినిబట్టి శాస్త్రిగారి ఆరోగ్యం ఫరవాలేదని భావించి ఊరటచెందింది లలితాదేవి.

ఆ రోజురాత్రి 11 గంటలకు బెనారసు చేరుకొన్నారు. వారికి టిక్కెట్ కొనలేదని టిక్కెట్ కలెక్టర్ పేచీపెట్టాడు. అర గంట ఆయనతో తగాదా. చివరకు ఆ పేచీ వదిలించుకొని బైలు దేరారు. ఇప్పుడా బస్తీలో బంధువులయింటికి వెళ్లాలి. వాళ్ళయిల్లు కనుక్కోవాలంటే మహాకష్టం. నిద్రపోయేవారిని లేపి అడిగితే కస్సుమంటారు సరికదా! ఆ కోపంతో సమాధానమే యివ్వరు. చివరికి రాత్రి 2 గంటలకు ఆ వీధీ, ఈ వీధీతిరిగి బంధువులయిల్లు కనుగొన్నారు

అత్తగారు లలితాదేవిని చూడగానే నీ అదృష్టమువల్ల బ్రతికాడు. రెండుమూడురోజులు నోటివెంట మాటలేదని చెప్పింది. నిజంగా అదృష్టమే. యంత్రానికైనా తం సమయానికి నీరు, బొగ్గు వేయకపోతే అది కదలదు. అలాంటప్పుడు ఈ మానవయంత్రానికి వేళకు తిండి, నిద్ర, విశ్రాంతి సరియగు రీతిలో లేకపోతే జీవించడం కష్టం. శాస్త్రిగారికి దేశసేవలోని పనులతో తీరిక ఉండడంలేదు. అందువల్ల ఆయనకు విశ్రాంతి నివ్వటానికి కమలాపతి త్రిపాఠీ గారింట్లో ఆయనను అట్టిపెట్టారు.

అది ప్లూరసీజబ్బు. రామనగరం వెళ్ళాలని బైలుదేరారట రేవు దగ్గర గుండె నొప్పిరాగా కొద్దిసేపటిలోనే స్పృహ లేకుండా పడిపోయారు. ఆ స్థితిలో శాస్త్రిగారిని త్రిపాఠి గారింటికి చేర్చారు మూడురోజులు నోటివెంట మాటరాలేదు. మూడోరాజు స్పృహ వచ్చింది. అందుకనే వెంటనే టెలిగ్రాం యివ్వలేరు.

ఒకనెల రోజులు బెనారస్‌లో ఉండి, శాస్త్రిగారి ఆరోగ్యం కుదుటబడ్డాక తిరిగి అలహాబాదు చేరుకున్నారు. అప్పటికి వేసవి కాలం సమీపించింది. కొండలమీదికి వెళ్ళమని డాక్టర్ల సలహా. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికేమిపెళ్తుంది. అందువలన శాస్త్రిగారికి అదొక అందరాని ఆకాశమే.

చివరకు తప్పలేదు. బలవతంమీద ఒకచోట అప్పుచేసి కొండనివాసానికి బైలుదేరారు. అదృష్టవశాత్తు జవహర్‌లాల్ నెహ్రూగారి కార్యదర్శి శివదత్త ఉపాధ్యాయ, రాణీఖేత్ నివాసి. ఆయన పలుకబడి ప్రయత్నంవలన వారికి చౌకలో అక్కడొక యిల్లు దొరికింది. వారు బైలుదేరినరోజున రైలుస్టేషను దగ్గర ఎవరో శాస్త్రిగారికి రెండువందల రూపాయలు యిచ్చారు. వారున్న చోట చింతచెట్లు విరివిగా ఉండేవి చింతగుల్లలు ప్రోగుచేసి చింతపండు సమకూర్చి వాటితో ఆ కాలం వెళ్ళదీసి, శాస్త్రిగారి ఆరోగ్యం కుదుటపడగానే అలహాబాదు చేరుకొన్నారు.

## ప్రముఖుల యింటివద్ద ఉండే చందమే

సర్వసాధారణంగా ప్రముఖులైనవారి యిండ్లవద్ద జనంఎప్పుడూ తిరుణాలనిధిగా ఉంటారు. ఒకరు వెళ్ళినపిదప ఒకరు తమస్వంత పనులనిమిత్తం వస్తూవుంటారు. చోటానాయకులవద్దకే జనంఎగబడి వస్తూఉంటారు. ఇక శాస్త్రిగారి విషయం చెప్పాలా? స్వాతంత్ర్య సమరంలో రహస్యంగా ఎన్నోపనులు నిర్వర్తించ వలసి ఉంటుంది. అందువలన రకరకాల మనుష్యులు శాస్త్రిగారి యింటి నిండా చేరేవారు.

శాస్త్రిగారు ఉదయం యింటినుండి బైలుదేరితే రాత్రి ఎప్పటికో వచ్చేవారు. అయినా వారు వచ్చేవరకూ జనం వేచియుండి ఆయన దర్శనంపొంది ఆయన్ను తీసికొని వెళ్ళడానికి ఆ రాత్రికి అక్కడే గడిపేవారు. ప్రొద్దుపోయి వచ్చినతరువాత స్నాన పానాదులు ముగించుకొనివచ్చి పేరుపేరున కుశల ప్రశ్నలడిగి వారిని సంతృప్తిపరచి నిద్రపోయేవారు. అలాంటి జనసందోహంలో ఖాళీ దొరక్క మేడమెట్లమీద దుప్పటి కప్పుకొని పండుకునేవారు. ఎంత నిరాడంబరులు.

ఛోటాఛోటా ఉద్యోగులనే టైంప్రకారం కలుసుకోవాలి. వేళప్రకారం తిండి, కంటినిండా నిద్రపోనిచే ఇంటర్వ్యూ లివ్వరు. అదీ క్రమప్రకారంకాదు. లాభ, నష్టాన్నిబట్టి. అలా సుఖాన్ని ఆరగిస్తూ పేదల కందకుండా ఉంటారు ఛోటాఛోటావారు. అయితే మన శాస్త్రిగారు లౌకికులు, ప్రజాసేవకులు. ప్రజాసేవయే వారి ఆశయం. అందువలన అందరికీ అందుబాటులో ఉండడాన, ఆ యిల్లు అంత కళకళలాడుతూఉండేది.

ఉదయం యింటినుండి బైలుదేరి వెళ్ళిన శాస్త్రిజీ ప్రొద్దుపోయేవరకు యింటికి చేరుకోరంటే ఏంచేస్తున్నట్లు? అన్న ప్రశ్న కలుగకపోదు. ఆయన మహోన్నత భావాలకు నిలయమైన మహనీయుడు శ్రీ జవహరులాల్ నెహ్రూగారి వద్ద ఏవో కార్యకలాపాలు నెరవేరుస్తూ ఉండేవారు. వారి ఉత్తరాలకు జవాబులు పార్టీకి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం వారివంతు పని ఎక్కువగా ఉండడంవలన యింటికి రాకుండా వారివద్దే

బోంచేసేవారు, యింటికి రావడానికి అవకాశం లేనియెడల యింటికి కబురుచేసేవారు. ఒకవేళ ఖర్మగాలి కబురందకపోతే లలితాదేవి అలాగే పస్తులుండేవారు.

ఒకసారి శాస్త్రిగారు యిలాగే యింటికె రానూలేదు. కబురు పంపలేదు. ఆమె అలాగే పాచినోరు తెరువలేదు. చూచిచూచి విసుగువుట్టి రాత్రి 11 గంటలకు తలువు వేసుకొని నిద్రపోయింది. అలసిపోయి ఉండడాన కళ్ళుమూయగానే నిద్ర ముంచుకొచ్చింది. అప్పుడు ఎవరో తలుపు తట్టారు. ఆరోజుల్లో హిందూ మహమ్మదీయ తగాదాలు ముమ్మరంగా ఉండేవి. ఆ భయంతో అలాగే నిద్రపోయింది. రాత్రి రెండుగంటలకు మెళకొవ వచ్చింది. కాని శాస్త్రిగారు లేరు. మరలా పండుకొన్నది. ఇక నిద్రపట్టలేదు. కడుపులో దిగులు లేకపోతేగా నిద్రపోవటానికి. తెల్లవారొచ్చింది. ఉదయం ఆరుగంటలకు తలుపుతట్టినట్లని పించింది. గబాలునవచ్చి తలుపు తీసింది. ఎదురుగా శాస్త్రిగారు నిలబడి ఉన్నారు. శాస్త్రిగారి మీద ఎక్కడలేని కోపంవచ్చింది. "నిన్నంతా భోజనం లేకుండా చంపారు" అనిఅన్నది లలితాదేవి కోపంగా.

సరేసరే యిక ఆపు రాత్రి ఎన్నిసార్లు తట్టినా లేవకపోతే విశ్వంభరనాథ్‌గారి ప్రెస్‌లో పండుకోవలసి వచ్చింది. పైగా యిదొక నిందా" అనేసరికి ఆమె తనపొరపాటుకు చాలాబాధపడ్డది. కాని నిజానికి రాత్రి శాస్త్రిగారు కబురంపారు. కాని ఆకబురు లలితాదేవికి అందలేదు. అదీ జరిగినసంగతి. లలితాదేవి నిన్నంతా పస్తున్నందుకు శాస్త్రిగారుకూడా పశ్చాత్తాపపడ్డారు.

ఇక ఆరోజునుండి నిద్ర ఆపుకొనడానికి ఎన్నోవిధాల ప్రయత్నం చేసింది కాని నిద్ర ఆగరేదు. కళ్ళల్లోనూనెవేసుకుంటే నిద్ర ఆగుతుందని రోజూ కళ్ళల్లో నూనె వేసుకోవడం ప్రారంభించింది. ఈ సంగతి ఎలాగో శాస్త్రిగారు పసిగట్టారు. ఎందుకంటే కృత్రిమంగా మనం ఏంచేసినా శారీరకమైన అలవాట్లలో ఏదోఒక ఆనర్ధకం వాటిల్లుతుంది. అందువలన జాలిపడి, మరొక ఉపాయం ఆలోచించి రోజూ తనే తలుపుకు బైట గొళ్ళెంపెట్టి తాళంవేసి వెళ్ళడం ప్రారంభిచారు. చివరకు అదీచాపై కూర్చుంది. మనుషులు లేనియిళ్ళకు తాళాలు వేసి కూర్చుంటే దొంగలు సునాయాసంగా తాళాలు తీసి దోచుకోవడం ప్రారంభమైంది. వారియింటి ముందు బెంగాలీవారి యిల్లు అలాగే దోచుకోబడింది. ఇక ఎదురుగా ఉన్నయిల్లు ఆగుతుందా? మనుష్యులుండగా అదొకపీడ కొనితెచ్చుకోవడం దేనికని ఆ పద్ధతి మానివేశారు. ఇంతలో తిరిగి శాస్త్రిగారు శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించవలసి వచ్చింది.

ఒకసారి శాస్త్రిగారు యింటి దగ్గరున్నప్పుడు స్నానం చేసివచ్చి ఆ ధోవతి ఆరవేయమని లలితాదేవికి యిచ్చారు. మేడపైన ఆరవేసింది. గదిలోకివచ్చి పడుకొంటే కమ్మని నిద్ర పట్టింది. ఎప్పటికో మెళకువ వచ్చింది. తీరాచూస్తే వర్షంకురిసి వెలిసిపోయింది. ఆరవేసినబట్ట తడవడమేగాక గోడమట్టంతా అంటుకొని మరకలైనవి వెంటనే ధోవతితీసి ఉదకడం ప్రారంభించింది. ఇంట్లో సబ్బుకూడలేదు వానిని ఉదికి, రుద్ది మరకలు పోగొట్టడానికి. శాస్త్రిగారు ఏమంటారేమోనని టొటబొట కన్నీరు

కారుస్తూనే ఉతుకుతూఉంది ధోవతి. ఆ దృశ్యమంతా అర్థంచేసుకొని ఆడబిడ్డ శాస్త్రిగారు రాగానే సర్దిచెప్పింది. అయ్యో! ఈ భాగ్యానికే నే కోప్పడతానా! ఎందుకూభయం! అని ఓదార్చారు.

అదే గడుసురకమైతే కించిత్తు తప్పుకు భయపడకపోగా పైగా ఎదిరించి తన్నులు తింటారు. నిజంగా ఆ దంపతులు ఆదర్శ దంపతులు. శాస్త్రిగారు, లలితాదేవిగారు వారి పూర్వజన్మ సుకృతంవల్ల, వారి పుణ్యం ఈ జన్మలో కలసివచ్చి ఆదర్శ దంపతులుగా కష్ట, సుఖాల్లో ఒకేరకంగా గడిపారు. నిజంగా వారి జీవితం ధన్యమైనది. ఇద్దరిలోను అనేక సుగుణాలుండడం గొప్ప విశేషమేకదా! వారిపై మనం విమర్శచేయడానికే ఒక్కతావుకూడ లేకుండా చేసికొన్నారు ఆ పుణ్యదంపతులు.

## తిరిగి అరెస్టులు

జైలునుండి శాస్త్రిగారు తిరిగి యింటికివచ్చారు. మరలా దేశంలో ఏవో భయంకరమైన సంఘటనలు జరిగేసూచనలు కాన వచ్చాయి. ఏక్షణాన ఏమిజరుగుతుందో తెలియకుండాఉంది. బొంబాయిలో సమావేశం జరిగింది. ఆ మీదట గాంధిగారి క్విట్టిండియా తీర్మానం జరిగింది. క్విట్టిండియా నినాదం మారు మ్రోగింది. ఇక నిప్పురాజుకొన్నది. నాయకులంతా వరుసగా అరెస్టవుతున్నారు. ఒక్కొక్క నాయకునికి అప్పజెప్పబడింది. అది మొదలు పెట్టడం అరెస్టులు కావడం వందల సంఖ్యలో అరె స్టులు కావడం జరుగుతూవుంది.

శాస్త్రిగారి వంతు యింకా రాలేదు. అందువలన ఆయన పట్టు బడకుండా తప్పించుకొన్నారు. ఒకసారి అల్లూరామ్‌దేశాయ్ కోసం పోలీసులువస్తే ఆయన ఆడవేషం వేసుకొని దిండు పసిపిల్ల వాడిలా ప్రక్కనవేసికొని ఆ ముప్పు చమత్కారంగా తప్పించుకొన్నారు.

ఇలా ఉండగా ఒకరోజు ఒక వ్యక్తివచ్చి శాస్త్రిగారు రమ్మన్నారని లలితాదేవిని తనవెంట రమ్మని కోరాడు. ఆ వ్యక్తి వెంటనే శాస్త్రిగారి దగ్గరకువెళ్ళి వెంటనే చీటీ వ్రాయించుకొని వచ్చారు. అప్పుడు అతనిమీద విశ్వాసం కల్గింది. శాస్త్రిగారు ఆమెను వంటరిగా రమ్మన్నారు. కాని పిల్లలతో గొడవ నాన్న దగ్గరకు నేనొస్తాను, అని ఏడ్వడం మొదలుపెట్టారు. పిల్లలను వదలి ఒక్కతే వెళ్ళితే ప్రక్కవాళ్ళకు అనుమానం. ఎలాగైతేనేం కన్నబిడ్డలకంటే ఎక్కువేముందని పిల్లలతో బైలుదేరింది. లలితాదేవి వెళ్ళేసరికి శాస్త్రిగారు ఎవరితోనో మాట్లాడుతున్నారు. సరే లలితాదేవిని ఆరాత్రి అక్కడే ఉండమని కోరారు శాస్త్రిగారు. లలితాదేవి అలాగే ఆగిపోయింది.

ఆ మాట్లాడేవారు వెళ్ళిపోగానే తలుపువేసి ఆమెకొక ఉత్తరంచేతికిచ్చి దానిని మీర్జాపురంలో ఒకరి కందించమన్నారు. దానిని అచ్చు వేయించడానికి ఎన్నివీలైతే అన్ని కాపీలు అచ్చువేసి పంపించే ఏర్పాటుచేసి పంపమన్నారు. ఈ రహస్య సందేశానికే లలితాదేవిని శాస్త్రిగారు అక్కడికి రప్పించారు. మరలా పోలీసు

హుకుం జారీ అయ్యింది కాబోలు ఎల్లుండి నేను అరెస్టవుతున్నాను జాగ్రత్తఅన్నారు.

"అత్తగారిని కలుసుకోరా? అని అడిగింది లలితాదేవి. రేపుసాయంత్రానికి యింటికి రావడానికి వీలుపడుతుందోలేదో, అయినా ప్రయత్నిస్తానని చెప్పారు అరెస్టు ఎక్కడవుతారు అని అడిగింది లలితాదేవి - గడియారం స్తంభం దగ్గర అనిచెప్పారు సరే ఉత్తరం జాగ్రత్తచేసింది లలితాదేవి. రెండోరోజురాత్రి శాస్త్రిగారు యింటికి వెళ్ళారు. గడియారం స్తంభం దగ్గరికి ఎలా వెళ్ళాలో ఆ ఏర్పాట్లన్నీ చేసుకొని వచ్చారు.

గడియారం స్తంభం దగ్గరకి చేరుకోవడం అంటే మాటలు కాదు. పోలీసులకు రేజా తెలియకుండా చేరుకోవాలి. లేకుంటే ముందే అరెస్టయిపోతారు. అలా అయితే అనుకున్న ధ్యేయం నెరవేరదు. అందువలన బహిరంగంగా మాత్రం మహమ్మదాలీ పార్కులో శాస్త్రిగారు నోటీసులు పంచిపెడతారని ప్రకటించి స్వయంసేవకులు నోటీసులు జారీ చేసేటప్పుడు రహస్యంగా గడియారం స్తంభం దగ్గర అని చెవుల్లో ఊదారు,

పిచ్చి ముండాకొడుకులు నిజంగానే మహమ్మదాలీ పార్కు దగ్గరనేఅనుకొని పోలీసు బందోబస్తు దిట్టంగానే జరిగిపోయింది. ఆరోజు లాఠీచార్జి ఖచ్చితంగా జరుగుతుందని అవసరమైతే గుళ్ళ వర్షం కురిపిస్తారని జనం గుబ్బిసలాడుతున్నారు.

శాస్త్రిగారు గడియారం స్తంభం దగ్గరకు వెళ్ళేయత్నంలో ఉన్నారు. లలితాదేవి గదిలో కూర్చొని కన్నీరు కారుస్తూ ఉంది. తల్లి కన్నీరు సుమన్ చూచి అమ్మను కోప్పడ్డారా అని తండ్రిని అడగ్గా వెంటనే శాస్త్రిగారు గదిలోనికి వెళ్ళి ఆ ఏడుపుచూచి నేను అరెస్టవ్వడం మామూలేగా, ఎందుకు ఏడ్వడం? అన్నారు. జవాబు లేదు కారణం చెప్పమని బలవంతంచేశారు. చివరికి లోపలఉన్న బాధ వెళ్ళగక్కింది. నాదగ్గర ఒక్క అణా మాత్రంఉంది నేను మీర్జాపురం ఎలావెళ్ళేది అని ఆ మాట జ్ఞప్తికివచ్చి ఏడుస్తు న్నాను అన్నది. శాస్త్రిగారు మొదట ఈ విషయం ఆలోచించలేదు. ఏడ్వడం కూడ మంచిదయ్యింది. అందువలన దానికి తగిన ఏర్పాటుచేసి వెళ్ళిపోయారు.

రెండు జాములైన తరువాత లలితాదేవికూడా గడియారం స్తంభం దగ్గరకు బైలుదేరింది, అక్కడకు రావద్దని, వస్తే చాలా ప్రమాదమని శాస్త్రిగారు ఎంతో నచ్చచెప్పి వెళ్ళారు. అయినా వినిపించుకోకుండా బైలుదేరివెళ్ళింది. పతివ్రతా శిరోమణులంతే. భర్తపోయాక నేను మాత్రం బ్రతికి దేనికని ప్రాణాలను లెక్క చేయరు. ఆమెతోబాటు అత్తగారు, గౌతమ్‌భార్య బయలు దేరారు. ఇక తప్పలేదు. అంతా గడియారం స్తంభం దగ్గరకు చేరుకొన్నారు.

మహమ్మదాలీ పార్కుదగ్గరకాక గడియారం స్తంభందగ్గరకు జనం గుంపులుకూడుతూవుంటే పోలీసులకు అనుమానం కలిగింది. గడియారంస్తంభందగ్గర కావలసినంత పోలీసుబలగంలేదు. ఏ కొద్ది

మందినో నియమించారు. వీరిటాంగా అక్కడికి చేరుకోగానే శాస్త్రి గారు టాంగామీద నిలబడ్డారు. ఇంక్విలాబాద్ నినాదాలు మిన్ను ముట్టాయి. ఆయన నోరుతెరచి "సోదర సోదరీమణులారా" అని అనగానే పోలీసుఅధికారి అరెస్టువారెంటు చూపించాడు ధన్యవాదాలు అంటూ తన సంచిలోవున్న కాగితాలు ప్రజలముందు ఎరజిమ్మి అరెస్టయ్యారు, ఆ మీదట పోలీసులు శాస్త్రిగారిని తీసుకువెళ్ళారు.

ఆరాత్రి ఎవ్వరోవచ్చి లలితాదేవికి 20 రూపాయలు యిచ్చి పోయారు. ఆ సంగతి ఆమెకు తెలుసు, మీర్జాపురంవెళ్ళి పని చక్కబెట్టుకురావాలని. రెండవరోజు పిల్లలను తీసికొని మీర్జాపురం వెళ్ళింది తనవంతుసేవ నిర్వర్తించడానికి. అత్తగారు రామనగర్ వెళ్ళింది. లలితాదేవితోపాటు తన మేనల్లుడుకూడ మీర్జాపురం బయలుదేరాడు. రైలుస్టేషనులో జనం క్రిక్కిరిసి ఉన్నారు. బండిలో ఖాళీలేదు. ఇక టిక్కెట్లు అందుకోలేక లలితాదేవి టిక్కెట్ కలెక్టరుకు పదిరూపాయలకాగితం యిచ్చింది. గుమ్మంగుండా ఎక్కడానికి వీలులేక కిటికీలోగుండా అంతా బండిలోనికిఎక్కి నిలబడ్డారు. రెండుమూడు స్టేషన్లుదాటినా టిక్కెట్ కలెక్టర్ అంతులేడు. లోపల భయం. ఎంతకీ రాకపోయేసరికి లలితాదేవికి అనుమానం కలిగింది. ఎందుకంటే శాస్త్రిగారిభార్యే టిక్కెట్ లేకుండా ప్రయాణంచేసిందంటే చిన్నతనంకదా.

బండి బైలుదేరింది. ఆమెభయాన్ని ప్రక్కనున్న ప్రజలు గమనించి ఆవేశంపెరిగి నీకేం భయంలేదు. వాడిసంగతి మేము చూచుకుంటామని గుండెధైర్యం చెప్పారు. మరలా వారిలో వారు

సంబాళించుకొని తగాదాదేనికితెమ్మని వారొక ఉపాయంపన్నారు. ముగ్గురు ప్రయాణీకులు వింధ్యాచలంలో బండిదిగిపోతూ వారి మూడు టిక్కెట్లు ఆమెకిచ్చివేశారు.

బండి మీర్జాపురం చేరుకొన్నది. పిల్లలతో బండిదిగి బైలు దేరింది బైటికి వెళ్ళడానికి. వెంటనే టి. సి. వచ్చి టిక్కెట్లుఏవి అన్నాడు. వెంటనే తనదగ్గరున్న టిక్కెట్లు యిచ్చివేసింది. ఈ టిక్కెట్లు మీ కెక్కడివి అని ప్రశ్నించాడు. జవాబు చెప్పలేదు. వాడికితెలుసు కథంతా. సందుదొరికితే డబ్బులు గ్రమింగుజామనే రకాలకు తనభర్త రైల్వేమంత్రి ఔతాడని ఆ దరిద్రుడికి తెలియదు. ఆ మీదట బిడ్డలను తీసికొని గమ్యస్థానం చేరుకొన్నది, మీర్జాపుర ములో తనభర్త చెప్పినమాట నెరవేర్చడానికి.

## క్లాక్‌టవరు కోలాహలము

స్వాతంత్ర సమరం ముమ్మరంగా సాగుతూఉంది. అలహా బాద్ క్లాక్‌టవర్‌మీద కాంగ్రెస్ జెండా ఎగురవేయాలి. ఆ పని ఎవరివల్లా సాధ్యపడటంలేదు. టాండన్, అల్గురాయ్ శాస్త్రి ఇత్యాది ప్రముఖులు తీవ్రంగా కృషిచేసారు. గుంపులు గుంపులుగా టవర్ దగ్గరకు వెళ్ళారు. పోలీస్ బందోబస్తు తీవ్రంగాఉంది. ఎన్నోరోజులనుండి ప్రయత్నం చేస్తున్నారు. కాని ఫలించడంలేదు. చివరకు ఏమీ తోచక కాంగ్రెస్ కార్యకర్తలంతా కలసి శ్రీమతి అరుణాఅసఫాలీ సోదరి శ్రీమతి పూర్ణిమాబెనర్జీ దగ్గరకు వెళ్ళారు.

ఆమె మంచి ఉపాయం చెప్పింది. అందరికీ నచ్చింది. సరే అంటే సరే అనుకొన్నారు.

ఆ క్లాక్‌టవర్ ఎక్కడం ఆహ్లాదకరంగా ఉంటుంది. ఎంతో మంది యాత్రికులు వచ్చి ఎక్కి పోతూఉంటారు. ఆ వినోదం గ్రూపులో పాల్గొని ఒక ఆడమనిషి నాలుగువేపులా మూసిఉన్న రిక్షా బురఖాతో దిగి టవర్ ఎక్కడం ప్రారంభించింది. పోలీసులు కస్టమ్స్ అధికారులకన్నా తెలివిగా ప్రవర్తించారుకాని కొద్దిక్షణా లలో కాంగ్రెస్‌జెండా ఆ టవర్ శిఖరాన రెపరెపలాడుతూ పోలీసు లను గేలిచేసింది. జనం విస్తుపోయారు. అక్కడచేరిఉన్న జనాం గము ఆనందముతో ఉప్పొంగి పోయింది. జయజయధ్వానాలు మిన్నుముట్టాయి. భారతమాతాకుజై అన్న నినాదాలు మారు మ్రోగాయి వారి కంఠాల్లో.

పోలీసులు పళ్ళునూరుతున్నారు. ఇంతలో ఒక ధోవతీ లాల్చీ ధరించిన సన్నటి మనిషి పోలీసులఎదుట మర్యాదగా నిలబడి నేనే జెండాఎత్తిందని, నాపేరు లాల్‌బహదూర్ అని చెప్పారు.

దొంగ దొరికేసరికి పోలీసులకు మంట ఆగింది. వెంటనే అరెస్టుచేసి ఆరుమాసాలు కారాగారశిక్ష విధించారు. ఈ సంఘటనను బట్టి ఆయన ధైర్యానికి, మనస్ఫూర్తికి పట్టుదల ఎట్టిదో మనం తెలిసికోవచ్చు.

# కాశీ విద్యాపీఠం విద్య

1921లోనే శాస్త్రిగారు స్కూలుకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్య సమరములో దుమికారు. విద్య యింకా పూర్తికాలేదు. అందువలన అరెస్టుకావడం, విడుదలకావడం జరుగుతూ ఉంది. కారాగారము నుండి ఒకసారి విడుదలయినపిదప కాశీ విద్యాపీఠంలో విద్య నభ్య సించడానికి ప్రవేశించారు.

గాంధీమహాత్ముడు విదేశీవిద్యను బహిష్కరించిన దగ్గర నుండి స్వాతంత్ర్య సమరయోధులు దేశానికితగ్గ విద్య నభ్యసించ వలెనని ఆరాటపడి స్వాతంత్ర్య సమరయోధుల పేరుమీదుగా కాశీలో కాశీ విద్యాపీఠం అన్న దేశీయ పాఠశాలను తెరిచారు. ఈ సంస్థకు శివప్రసాద్ అనే కోటీశ్వరుడు పదిలక్షల రూపాయలు విరాళమివ్వగా ఆ విద్యాపీఠం నిర్విఘ్నంగా కొనసాగింది.

దానిలో శాస్త్రిగారు తన విద్యాభ్యాసం ప్రారంభించారు. ఆ పరీక్షలలో ప్రథమశ్రేణియం దుత్తీర్ణులై "శాస్త్రి" అనే బిరుదు అవలీలగా గడించారు. సూక్ష్మ పరిశీలనాశక్తి, సులభ గ్రాహ్య బుద్ధివలన ఆయన సునాయాసంగా "శాస్త్రి" అనే పట్టం పొందారు. ఆ సమయంలోనే శాస్త్రిగారు హిందీ, షార్టుహేండ్ నేర్చుకొన్నారు. అది ఏ. ఐ. సి. సి. కార్యక్రమాలను రికార్డు చేసుకోవడానికి తోడ్ప డింది. విద్య అబ్బాలేగాని అదే ఏ విద్యయైనా తుప్పుపట్టేదికాదు. ఎప్పటికైనా విదేశబంధువు, నిగూఢ గుప్తమగు విత్తమది.

అంతటితో విద్యను స్వస్తిచెప్పి తన యావచ్ఛక్తిని ప్రోక్షించి భారతమాత బానిస శృంఖలాలు త్రెంచి వేయడానికె ఆయత్తపడ్డారు. అల్లురాయ్‌శాస్త్రి, టి. ఎన్. సింగ్, శ్రీ ప్రకాశ్, ఆచార్య కృపలాని, నరేంద్రదేవ్, సంపూర్ణానంద్ వీరందరూ శాస్త్రి గారి సహవిద్యార్థులే. వీరితో పరిచయం ప్రప్రథమంగా ఈ విద్యా పీఠములోనే జరిగింది.

శాస్త్రిగారి విద్య పూర్తియైన పిదప శాస్త్రిగారు ప్రముఖ జాతీయ నాయకులైన లాలాలజపతిరాయ్ "పీపుల్స్‌ఆఫ్ యిండియా సొసైటీ" లో యావజ్జీవ సభ్యులుగా చేరారు. సంస్థ ప్రధానాశయ మైన అస్పృశ్యతమీద దృష్టిని కేంద్రీకరించి, ఆ ధర్మాలకోసం తీవ్రంగా కృషిసల్పి, దాని నిర్మూలనకు పాటుపడ్డారు.

తరువాత దాని అధ్యక్షులుగా శ్రీ టాండన్ ఎన్నికకాగా ఆయనకు కుడిభుజంగా నిలిచారు. ఎందుకంటే శాస్త్రిగారంటే టాండన్‌గారికి మిక్కిలి అభిమానం. ఆయనలోని నేర్పరితనం, సత్యసంధత, కార్యదీక్ష టాండన్‌గారిని అమితంగా ఆకర్షించాయి. ఇక ఆయనలోనున్న సౌజన్యం, వినయం, నిష్కళంక హృదయం వలన అందరిచేత ఆకర్షింపబడేవారు. అందువలన ఆయన తనకు కుడిభుజంగా ఉండగలరని టాండన్‌గారు శాస్త్రిగారిని అలహాబాద్‌కు రప్పించుకొన్నారు. నమ్మిన ఆశయానికి తాను పాటుబడి యితరు లనుకూడా ఆశయసిద్ధికి కృషి చేయించగలిగే శక్తి ఆయనకుంది. మరొక గొప్ప విశేషమేమంటే తమకు పరిచయముండున్న మహా

వ్యక్తులలోని ఉత్తమగుణ సంపదను ఈయన అలవరుచుకొనుట, వీరికి అనుకరణ శక్తి అమోఘంగాఉంది.

ఇలాటి ఉత్తమగుణాల మహనీయుడైనందున పెద్దలు బహుగా ప్రేమించి ఆయన ప్రజ్ఞా విశేషాలకు ముగ్ధులయ్యారు. తరువాత శాస్త్రిగారికి అజేయుడైన మన పూజ్య ప్రప్రథమ ప్రధానితో పరిచయమేర్పడి ఆయన అభిమానాన్ని యిట్టే పొందగలిగాడు. టాండన్ నెహ్రూ లిద్దరూ శాస్త్రిగారిని అమితంగా ప్రేమించారు. న్యాయంగా శ్రీమంతుడై తన్నుతాను తగ్గించుకొని సర్వస్వం దేశానికి సమర్పించి మహోన్నతునిగా నిలచిన మన పండిట్ నెహ్రూజీని బట్టియే శాస్త్రిగారి జీవితము ప్రభావితమైనదని చెప్పకతప్పదు.

ఈ విధంగా కుటుంబ విషయములో లేమివలన పస్తులుంటూ సత్యంకోసం నిలచి, సత్యహరిశ్చంద్రునివలె సర్వకష్టాంకుగురై 1947 సం॥ ఆగష్టు 15 స్వాతంత్ర్య దినపు వెలుగులు కండ్లార చవిచూచారు.

## పనిలో ఓర్పు టీ కొరకు నెహ్రూతో పోటీ

1937-39 మధ్య ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ సభ్యుడుగా ఆయన ఎన్నుకోబడ్డారు అసెంబ్లీహాలులో ముందుకూర్చునియున్న లాల్‌బహదూర్‌శాస్త్రి పై వెనుకవరుసలో గోవింద వల్లభపంత్ దృష్టిపడింది. ఆయనకా పదవి అబ్బినా గర్వం, అహంభావం ఏమాత్రమూలేవు ఒకసారి ఆయన ఉత్తరప్రదేశ్ హోంమంత్రిగా

పనిచేసేటప్పుడు చిన్న సంఘటన జరిగింది. ఒకరోజు ఒక సభలో పాల్గొనుటకు శాస్త్రిగారు వెళ్తున్నారు. ఆ సమయంలో కారు ప్రమాదం జరిగింది. ఆ విషయం పోలీసుస్టేషనులో నివేదిద్దామని శాస్త్రిగారు హుటాహుటిని అక్కడికివెళ్ళారు.

అక్కడ స్టేషన్‌లో సబ్-యిన్‌స్పెక్టరులేడు. కానిస్టేబుల్ మాత్రం ఉన్నాడు. ఇన్స్‌పెక్టర్‌గారు ఎక్కడికెళ్ళారని పోలీసు నడిగారు. అతను ఎవరో అనుకొని నిర్లక్ష్యంగ అక్కడ కూర్చో వస్తారని చెప్పాడు. సామాన్య మానవులకు జరిగే మర్యాదే జరిగింది శాస్త్రిగారికి. మనుష్యులకు ముఖానఉండవాయె బిరుదులు. అవి తెల్సుకుంటేనేగాని మర్యాద యివ్వరు. మూటలుచూచి పీటలు వేయడం మన ఆనవాయి. శాస్త్రిగారు ఇన్‌స్పెక్టరుగారు ఎంత బిజీలో ఉన్నారో ననుకొని వేచిఉన్నారు.

అప్పటికే చాల ఆలస్యమయ్యేసరికి శాస్త్రిగారు అతనిదగ్గరకు వెళ్ళి ఇన్‌స్పెక్టర్‌గారు ఎక్కడికి వెళ్ళారు అని జవానునడిగారు. నీకెందుకయ్యా! అక్కడకూర్చో వస్తారు! అని వాగుతూ ఉండగా సబ్-యిన్స్‌పెక్టర్ రావడం హడావుడిగా నమస్కారంపెట్టి మర్యాద చేయడంచూచి పోలీసుజవాను గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. తరువాత శాస్త్రిగారు తనపని చూచుకొని వెళ్ళారు. వారు మంత్రిగారని తెలిసి ఎంత కంగారుపడ్డాడో పోలీసుజవాను.

అంత జరిగినా ఆయన చూపిన నెమ్మది. ఓర్పు చెప్ప శక్యముగానిది. అటువంటి మహనీయులైనందుననే, దేశానికి

విముక్తి తేగలిగారు. స్వార్థ సంకుచిత పరులై మెలిగిన మన స్వాతంత్ర్యము గగన కుసుమంగానే ఉండేది.

ఆర్థికంగా తాను ఎంత బాధపడ్డా ఆ బాధ రెండోవ క్తికి తెలిసేదికాదు. ఆయనెంత దుర్భర దారిద్ర మనుభవించినా, ఎంత పలుకుబడిఉన్నా చిల్లిగవ్వ యితరులను అప్పడిగేవారుకారు. ఒక సారి ఎన్నికల ప్రచారంకోసం శాస్త్రీగారు, శ్రీ జవహరులాల్ నెహ్రూ శ్రీమతి పూర్ణిమాబెనర్జీ కారులో బైలుదేరారు. ఎక్కడికి వెళ్ళినా శాస్త్రిగారు శ్రీ నెహ్రూగారితో ఉండాలి. ఎన్నికల ప్రచారం ముగిసిన తరువాత టీ త్రాగాలన్న ఆతుర్దాతో నెహ్రూ గారు కారు జోరుగా పోనిస్తున్నారు. రోజుకు ఎన్నోసార్లు నెహ్రూగారు టీ త్రాగుతారు. అందువలన ఆ ఆశ ఆపుకోలేక కొన్ని నిమిషాలలోనే అలహాబాదు చేరుకొన్నారు. టీ అంటే శాస్త్రిగారికికూడ యిష్టం. ఇక టీ త్రాగడానికి రెడీ అంటే రెడీ అనుకొన్నారు.

స్టేషన్కెదురుగానున్న టీ స్టాల్లో ముగ్గురు ప్రవేశించారు. బిల్లు రెండురూపాయలయింది. డబ్బులిచ్చి వేయమన్నట్లు నెహ్రూ శాస్త్రిగారివైపు చూశారు కాని వారిజేబులో చేయిపెడితే నాలు గణాలుమాత్ర మున్నవి. నెహ్రూగారివద్దకూడ లేవు. చివరకు ఎలాగో చెల్లించారు. దీనినిబట్టి వారి నిండువసం మనం గ్రాహ్యం చేసుకోవచ్చు. అంతపెద్ద కాంగ్రెస్ నాయకుడైయుండి ఏమీ సంపాదించుకోలేదంటే ఆయనగారి నిజాయితీకి మనం బ్రహ్మరథం పట్టాలి. అంతేకాదు, మంత్రిపదవిలో ఉన్నప్పుడుకూడ చిరిగిన

చొక్కాలు కోటుక్రింద ధరించి సభకు వెళ్ళేవారట. బెనారస్‌లో చదివేటప్పుడు యింటికి రావటానికి పడవకు డబ్బులులేక గంగా నదిని ఈతమీద దాటివచ్చిన ఆ నిష్ఠాగరిష్ఠుని ఏమనికొనియాడాలి. అటువంటి మహనీయులు యుగానికొకరు పుడతారేమో చెప్పలేము.

## రాజకీయ పదవులు

ఉత్తరప్రదేశ్‌లో 1946లో గోవింద వల్లభపంత్ ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. తనకు పార్లమెంట్ సెక్రెటరీగా శాస్త్రిగారిని శ్రీ పంత్ ఎన్నుకున్నారు. టాండన్ మొదటి గురువు, రెండవగురువు పంత్ అయ్యారు. ఉత్తమగుణాలను చేపట్టే శాస్త్రిగారు పంత్‌లోని సద్భావాలను యిట్టే అలవరచుకొన్నారు.

రానురాను నెహ్రూ టాండన్‌గార్లకు విభేదాలు పొడసూపాయి. అందుకు నెహ్రూగారు కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చారు. నెహ్రూలేనిదే కాంగ్రెస్ రథము దొర్లదని టాండన్‌గారు నెహ్రూగారినే ఆభారము వహించమని రాజీనామా యిచ్చి వారు తిరిగి కాంగ్రెస్ ప్రసిడెంట్ కావడానికి అవకాశం కల్పించారు.

ఏమిచేసినా, మనసుల్లో ఉన్నది. అల్లుకుపోలేదు. ఆ మనస్పర్థలను తొలగించడానికి ఎంతోమంది కృషిచేశారు. కాని లాభం లేకపోయింది. శాస్త్రిగారికి కాంగ్రెస్ సెక్రటెరీనిచేస్తే వ్యవహారం చక్కబడుతుందని శ్రీ మోహన్‌లాల్‌గౌతమ్, బి. సి. రాయ్ లాంటి ప్రముఖులు సలహా యివ్వగా శాస్త్రిగారిని సెక్రెటరీని

చేశారు, ఈయన యిద్దరికీ ఆప్తుడే. చివరకు తనసారథ్యపు నేర్పు వలన రాజీకుదిరింది. బండి సక్రమంగా నడిచింది. ఆ విధంగా రాష్ట్రిస్థాయి నుండి కేంద్రానికి చేరుకొన్నారు.

శాస్త్రిగారు నిశితప్రజ్ఞ గలవారు. తన నేర్పు, మంచితనము వలన ఎటువంటి తగాదానైనా తృటిలో పరిష్కరించగల్గిన ప్రజ్ఞ వారిలోఉంది. ఉభయ పక్షాలకు న్యాయం జరిగేటట్లు పరిష్కరించ డమే ఆయనలోని గొప్పతనం. ఇరుపక్షాలవారు ఆయన్ని అభినం దిస్తారు. ఏ రాష్ట్రములో ఎక్కడ తగాదా తలయెత్తినా సంతృప్తి కరంగా పరిష్కరించ గలడని నెహ్రూగారికి ఆయనయందు గాఢ నమ్మిక యుండి న్యాయాధిపతిగా నియమించేవారు. అట్టి సమైక్యత ప్రజలలో ఆయన నేర్పుతో నెలకొల్పినందున నెహ్రూగారికి అమిత సన్నిహితులయ్యారు శాస్త్రిగారు.

కాంగ్రెస్ మహాసంస్థ పునరుద్ధరించే నిమిత్తం ఆయనగారు ఉత్తరప్రదేశ్‌లోని తన మంత్రిత్వానికి రాజీనామా యిచ్చారు. కాంగ్రెస్ సంస్థకు కార్యదర్శిగా ఉండి అతి సమర్థవంతంగాను, చాకచక్యంగాను నిర్వహించి అందరి మెప్పును చూరగొన్నారు.

ఆ మహనీయుడు 1955 నుండి భారత ప్రభుత్వములో మంత్రిగా చేరారు. అప్పటినుండే ఆయన జీవితం క్రొత్త మలుపుకు మళ్ళింది.

ఆయన 1952లో రాజ్యసభకు ఎన్నికైనప్పుడు శాస్త్రిగారిని రైల్వే రవాణామంత్రిగా ఏర్పాటుచేశారు నెహ్రూగారు. వీరిని

గురించి మనం వేరే చెప్పనక్కరలేదు. ఉన్నప్పుడు గర్వపడలేదు, లేనప్పుడు దిగజారి బేజారై పోలేదు. రైల్వేమంత్రిగా వున్నప్పుడు అందరు మంత్రులవలె ప్రత్యేక సెలూన్‌లు వుపయోగించేవాడుకాదు. అతి నిరాడంబరులు.

ఒకసారి ఏదో సభకువెళ్తూ శాస్త్రిగారు రైలుబండిలో వెళ్ళారు. ఇక జనమంతా ఆ బండిలో వస్తారని ఆశించి సెలూన్ ఏవైపునవున్నదోనని వెదకడం ప్రారంభించారు. కాని సెలూన్ దొరకలేదు. ఆఖరికి వారు రెండవతరగతి పెట్టెనుండి దిగడం చూచి జనం ఆశ్చర్యపోయారు.

ఒకసారి రైల్వేలమంత్రిగానే ఉన్నప్పుడు ఇంటికిరాగా యింటినిండా పిల్లలు చిత్తుకాగితాలు చిందరవందరగా పడవేశారు. అప్పుడు లలితాదేవిగారు తన కార్యక్రమములో నిమగ్నమైఉన్నారు. ఇంట్లో ఆ అసహ్యంచూచి శాస్త్రిగారు చీపురు తీసికొని ఊడ్వడం ప్రారంభిస్తే అంతా నిర్ఘాంతపోయారు. జవాన్లు నోరుతెరుచుకొని చూస్తున్నారు. మంత్రియైనా యింత సామాన్యజీవితం గడిపినవారెవరైనా మన పెద్దల్ని చూపమనండి చూద్దాం! అలాంటి మహనీయుడు ప్రత్యేక సెలూన్ ప్రయాణాలలో ఉపయోగించరని సామాన్యప్రజల కేమితెలుసు.

తాను రైల్వేమంత్రిగా ఉన్నప్పుడు 1956 అరియలూర్ జనగాల మధ్య రైలు ప్రమాదం జరగ్గా "రాతు మెత్తనైతే గుఱ్ఱం మూడుకాళ్ళమీద నడుస్తుంద"న్న సామెత వారిలోమెదిలి తన

మంత్రిపదవికి రాజీనామా యిచ్చారు. వర్కర్సు తప్పుచేస్తే తన అసమర్ధతవలననే ఈ నేరంజరిగిందని క్రుంగిపోయి వెంటనే రాజీనామాచేసి సామాన్య సభ్యుడైపోయినాడు యిట్టిమహానీయుని 'త్యాగి' యనక మరేమనగలము?

ఇది సామాన్యంగా చాలా తక్కువ మంది నాయకులలో చూడగలము. కాని వారి సంఖ్య నూటికికోటికి ఒకటికంటే ఎక్కువ వుండదేమో.

అలహాబాదు నియోజకవర్గమునుండి 1957 జనరల్ ఎన్నికలలో లోక్‌సభకు శాస్త్రీగారు ఎన్నికయ్యారు. వారి సమర్ధత కార్యదక్షత నెహ్రూగారు ఎరిగిందేకదా. రవాణా కమ్యూనికేషన్ మంత్రిగా నియమించారు. కొంతకాలం వాణిజ్య పరిశ్రమల మంత్రిగా పనిచేశారు.

ఆజానుబాహుడు కార్యదక్షుడైన పండిట్‌పంత్ నిర్యాణానంతరము హోమ్‌మంత్రి పదవి ఖాళీఅయ్యింది వారితో దీటురాగల సమర్థులు అందులో ఉంటేగాని ప్రభుత్వ రథం కదలదు. అందువలన సర్వసమర్థులు శ్రీ శాస్త్రీజీయే నని యోచించి నెహ్రూజీ 1961వ సం॥ ఏప్రియల్‌లో హోంమంత్రిగా నియమించారు.

తిరిగి 1962లో ఎన్నికలొచ్చాయి. ఆ ఎన్నికలలో శాస్త్రీగారు నెగ్గారు. మరలా హోంమంత్రిగా వారినే నియమించారు. అయన చాకచక్యం, సమర్ధత బాగా బుజువైంది. ఎన్నో తీరని సమస్యలు, శాస్త్రీగారు పరిష్కరించారు. ఆ విధంగా పరిష్కరించి 'ఉక్కు మనిషి' అని పేరు తెచ్చుకొన్నారు.

అవినీతిని నిర్మూలించాలని శ్రీ సంతానం ఒక కమిటీని వేశారు. వారు దానికి ఆమూలాగ్రంగా పరిశీలించి వాటిని రూపు మాపుటకు పథకాలు వేశారు.

అయితే సూక్ష్మగ్రాహియైన శాస్త్రీజీ ఉద్యోగుల యిబ్బందులు కూడ గ్రహించి, వారి చాలీచాలని జీతాలు పెంచి, వారి ఆదాయ వ్యయాలమీద శ్రద్ధతీసుకోవాలని సంకల్పింపజేశారు. ఏ శాఖలో నున్నా నీతి, నిజాయితీపరులకు ఓటమే ఉండదుకదా!

ఆ రోజుల్లో శ్రీ సంజీవయ్యకు, సంజీవరెడ్డికి పొడసూపిన విభేదాలు, తీవ్ర పరిణామాలకు దారితీశాయి. కాంగ్రెస్‌పార్టీకూడ ఆంధ్రలో రెండుభాగాలైంది. ఆ అదనులో దానిని చల్లార్చడము దేశాధినేతల విద్యుక్తధర్మం.

అందువలన వెంటనే శాస్త్రిగారిని ఆ వ్యవహారం చక్కబెట్టమని నెహ్రూజీ హైదరాబాదు పంపారు. ఎవరెవరికి ఏమి ఊదారో తమ చెవుల్లో వారంరోజులలో వరదతీసినట్లు తగ్గుముఖం పట్టాయి వారి తగాదాలు. తద్వారా ఆంధ్రలో శాంతిని సృష్టించిన కీర్తిప్రతిష్టలు శాస్త్రిగారికే దక్కినవి.

ఆ మీదట ముఖ్యమంత్రి సంజీవరెడ్డికావడం శ్రీ సంజీవయ్య కేంద్రానికి మంత్రిగా వెళ్ళడం తటస్థించింది, ఆయనలో ఒక్కటే అద్భుతమైన నేర్పు ఎవరు ఏంచెప్పినా చక్కగా వింటారు. విన్నంతసేపూ వారి మనిషిగానే కనబడతారు. కాని తీరాచూస్తే చివరికి ఎవరికీ నొప్పికలగనిపద్ధతిలో ఆ తగాదా పరిష్కరించేవారు.

ఉభయులూ సంతృప్తిపడి భూషించేవారేకాని దూషించేవారుకాదు. అదీ ఆయనలోవున్న గొప్ప నేర్పు.

కల్లోలం చెలరేగి రక్తపుటేరు ప్రవహించవలసిన సమయములో తన నేర్పును బహు సునిశితంగా ఉపయోగించిన మరొక ఘట్టాన్ని తెలుసుకొందాం.

కాశ్మీరులో పవిత్ర కేశాల్ని ఎవరో సత్కరించి అల్లకల్లోలాన్ని సృష్టించారు అప్పుడు పెద్ద అల్లకల్లోలం సంభవించింది. దానిని సమర్థించగల సమర్థులు శాస్త్రిగారేనని భావించి వారిని నియమించగా వారు వెంటనే పార్లమెంట్ హోంశాఖ సెక్రటేరిని కలుపుకొని, కాశ్మీరు వెళ్ళి ఆ అపహరణ ఉదంతాన్ని సాకల్యంగా తెలిసికొని రాజకీయ కీలకాన్ని పసికట్టి అంచర్నీ సమావేశపరచి ఆ మహాఉద్ధృతాన్ని తృటిలో సమసిపోయేటట్లు చేశారు. అప్పుడే దేశద్రోహిగా బంధించబడిన షేక్ అబ్దుల్లాను విడుదల చేయాలన్న నిర్ణయం జరిగింది. యింత సాహసంగా ఆ సమస్యను సరిదిద్ది కాశ్మీర్‌లో శాంతి నెలకొల్పిన తరువాత ఢిల్లీ తిరిగివచ్చారు.

అలాగే సిక్కులు తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని సంత్‌ఫతేసింగ్ అధ్వర్యమున అల్లర్లు జరిగినప్పుడు శాస్త్రిగారు హుటాహుటిన అక్కడికివెళ్ళి సంత్‌ఫతేసింగ్ నిరాహారదీక్షను తన చాకచక్యముతో విరమింపచేసి ఆ ఉద్యమం మరలా తిరిగి తలెత్తకుండా చేసివచ్చారు. ఆవిధంగా ఆ కీర్తికూడా వారికే దక్కింది.

కామరాజు పథకం ప్రకారం సీనియర్ కాంగ్రెస్ నాయకులు తమపదవులకు రాజీనామా యివ్వాలని నిర్ణయించగానే తడుము కోకుండా వెంటనే తన మంత్రి పదవికి రాజీనామ యిచ్చి వైదొలి గారు తనకు పదవి ముఖ్యముకాదు. కాంగ్రెస్ క్షేమమే తనకు ముఖ్యము. మాటలతోకాక చేతలతో ఆయన లిఖిత పూర్వకంగా వ్రాసియిచ్చి పదవిని విడనాడారు

వెంటనే మెట్లుదిగి వస్తుండగా కారుడ్రైవరు తలుపులు తెరచి ఎక్కమన్నట్లుగా వినయం అభినయించాడు. నేను యీ రోజునుండి మంత్రినికాను. మామూలు సభ్యుణ్ణి. నేను నడచి వెళ్తాను అని కారు ఎక్కకుండా నిరాకరించి యింటికి నడచివెళ్ళి లలితాదేవితో ఈ రోజునుండి మనకు రెండుకూరలు చేయవద్దు, ఒకటిమాత్రమే చేయమని ఆజ్ఞాపించగా లలితాదేవి విస్తుపోయి అసలు కారణమేమని అడగ్గా మంత్రిపదవికి రాజీనామా యిచ్చిన సంగతి అప్పుడు చెప్పారు. ఎంత నిరాడంబర జీవియో యింకా వేరే చెప్పవలెనా ?

## నెహ్రూజీ చివరి ఘడియలు

శాస్త్రిగారు రాజీనామా యిచ్చిన కొద్దిమాసాలకు భువనేశ్వర్‌లో కాంగ్రెస్ మహాసభ ప్రారంభమైంది. ఆ సభ జరుగుతూ ఉండగా మన పూజ్యనాయకులు శ్రీ నెహ్రూగారికి పక్ష వాతం వచ్చింది. అప్పటినుండి శాస్త్రిగారు నెహ్రూగారి మంచం వదలకుండా రాజకీయ కార్యకలాపాలతోపాటు వారికి పరిచర్యలు చేయడం ప్రారంభించారు.

తదుపరి శాస్త్రీగారిని పోర్టుపోలియోలేని మంత్రిగా అట్టి పెట్టుకొన్నారు. తనకు పనిలేనందున నన్ను ఏమి చేయమంటారని నెహ్రూగారిని సలహా అడిగారు. ఇక నాపనే చూడమని తనభారం ఆయనపైమోపి కన్నుమూశారు. 1964 సం॥ మే 27 మధ్యాహ్నం కన్నుమూశారు. నెహ్రూలాంటి ప్రజాస్వామ్య రాజ్యాధినేతను పోగొట్టుకొన్న భారతజాతి తనదుస్థితికి దురపెల్లింది. జరగవలసిన కార్యక్రమం ఎలాజరుగు తుందోనని పెద్దలంతా భయపడ్డారు. నెహ్రూగారు తనవారసుని నిర్ణయించకుండానే కన్నుమూశారు.

అయిననూ నెహ్రూగారి ఆశీర్వచనములులోలోన దాగియుండడాన ప్రజలు 1964లో శాస్త్రీజీనే తమ ప్రధానిగా ఎన్నుకొన్నారు.

ఆయన ప్రధాని పదవి స్వీకరించిన పిదప అన్నీసమస్యలే. ఇటు యింటా అటు బైటా పరిస్థితులు ఉక్కిరిబిక్కిరిగా ఉన్నాయి ఒక రాష్ట్రమంటే ఒక రాష్ట్రానికి ద్వేషం. ఒకభాష వారంటే మరొక భాషవారికి ద్వేషం దేశంలో దారిద్ర్యం తాండవిస్తూఉంది. దానిని మొదలంట నిర్మూలించాలని ఆయన వజ్రసంకల్పం.

అందువలన కొన్ని రాష్ట్రాలకు తానే స్వయంగా వెళ్ళి అక్కడి అంతరంగిక సమస్యలను పరిష్కరించి దేశాన్ని ముందుకు నడిపించడానికి పూనుకొన్నారు. ఆ మీదట వారితో అందరూ చేయికలిపి దేశక్షేమం కోసం కృషిచేయడానికి ఆయత్తపడ్డారు.

తదుపరి విదేశాలకు శాంతి యాత్రలుసల్పి మన ఆలీన విధానల రహస్యాన్ని అందరికీ విసదపరచి ఇంట గెలిచి రచ్చ గెలవాలన్న ఆకాంక్షతో అందరి నెయ్యం, ఆశీస్సులు సంపాదించారు.

మన నెహ్రూగారి అనంతరం ఆయన అడుగుజాడల్లో నడుచుకొంటూ ఆయన సాధించే కార్యాలుచూచి భారతప్రజలేకాక సమస్త ప్రపంచము జోహార్లర్పించింది. ఇరుగు పొరుగు దేశాలతో ఆయనచేసిన స్నేహయాత్రలు భారత చరిత్రకే మకుటాయమాన మైనవి. ఆయన నిముషం విశ్రమించక భారతజాతి క్షేమంకోసం ఆయన తహతహ యింతంతకాదు.

నెహ్రూతరువాత ప్రధానమంత్రి శాస్త్రియా అని అనినవారు లేకపోలేదు. అటువంటి వారినికూడా తన ప్రజ్ఞాప్రాభవములతో దేశవిదేశ వ్యవహారములను సమర్ధవంతంగా నిర్వహించి మంత్ర మహోద్ధలను గావించి భేష్ తగినవాడపయ్యా శాస్త్రీజీ అని అనిపించు కొన్నారు.

డాంబికమంటే గిట్టదు. అతి నిరాడంబరుడు. అందరిని సమదృష్టితో వీక్షించి అందరి మన్ననలను పొందిన అజేయుడు శ్రీ శాస్త్రిగారు.

తన ఒకటిన్నర సంవత్సర పరిపాలనలో దేశంలోనే ఎన్నో గడ్డుసమస్యలను ఎదుర్కొనవలసి వచ్చినది. వారి హయాములో దక్షిణాదిని హిందీభాషా వ్యతిరేకత వెర్రితలలు వేసింది. అల్లర్లు గృహదహనాలు విపరీతంగా సాగిపోయాయి. దేశం రెండుముక్క

లవుతుందన్న భయం వాటిల్లింది. కాని కరుణామయుడు ప్రజల వెర్రితనానికి తన్నుతాను తగ్గించుకొని నా ప్రజలకు యిష్టంలేని ఏ పనీ చేయనని వాగ్దానముచేసి ఆ దహనకాండను స్వయంగాచూచి ఆపి, ఓదార్చిరాగా, అంతట ఆ దుమారం సద్దుమణిగి దేశం ముందుకు పోసాగింది. వారి నైపుణ్యమువలన ఈ విధముగా యిల్లు సరిదిద్దుకుంటూ ఉండగా పాకిస్థాన్‌తో కాశ్మీరువిషయం పెద్ద రగడ సంభవించింది.

అలీనరాజ్యాల శిఖరాగ్రసభ కయిరోలో జరిగినపుడు ఆ సమావేశానికి శాస్త్రీజీ ప్రధానపాత్ర వహించారు. ఆ సభ నడిపింపులో ఆయనచూపిన చొరవతీరుకు ప్రపంచ నాయకులందరూ ప్రశంసించాడు.

సింహళ, బర్మా దేశములలోని భారతీయుల కష్టసుఖములనుగూర్చి ఆ ప్రభుత్వములతో చర్చలుజరిపి విజయము సాధించుటయేగాక, చిన్నచిన్న బేదాభిప్రాయములు పోగొట్టుటలో ఆయన చూపిన బుద్ధి కుశలత అమోఘం. అలాగే నేపాల్‌రాజుతో మైత్రిని సుస్థిరం చేశారు. ఆ విధంగా సరిహద్దులలోని మన పొరుగు పరిపాలకులతో మైత్రి నెరపి అజాతశత్రువని బిరుదువహించారు.

కాని కాశ్మీరు విషయం మనకు కంటిలోని నలుసైకూర్చొని వేదిస్తుంది. మంచి మాటలతో పాకిస్థానీయులు వినేటట్లు కనిపించ లేదు. కయ్యమే వారికి వియ్యము. భారతదేశానికి శిరస్సువంటిదైన కాశ్మీరు విషయమును ఐక్యరాజ్యసమితిలోకి నెట్టి రగడ

జరిపించేకాక అవతల కోతిమూకల బలంచూచి ఇండియామీద ఎగిరెగిరి పడడం సాగించింది పాకిస్థాన్.

మాటలతో లాభంలేదని శాస్త్రిగారు అమరజీవులను ఆత్మలో తలపోసికొని దైవాన్ని ధ్యానించి మనసైన్యానికి పిలుపునిచ్చారు. ఆయన నోటినుండి మాటవచ్చినతోడనే అతిఉత్సాహముతో ఉరకలు తీస్తు "భారతమాతాకిజై", "జై జవాన్ జై కిసాన్", లాల్‌బహదూర్ శాస్త్రీజీకీ జై" అనేనినాదాలతో బైలుదేరి శత్రువుని తరిమికొట్టడం ప్రారంభించారు.

ప్రజలంతా మన శాస్త్రీజీని వెన్నుకాచి యున్నారు. దేశం ఒక్కతాటిమీద నిలిచింది. ఈ అజేయమయిన శక్తికి సర్వ ప్రపంచం బిత్తరపోయింది. పోరుముమ్మరంగా సాగించి. బలియమయిన పాటన్‌టాంకులు మన సైన్యం ధాటికి తట్టుకోలేక కాళ్ళు విరిగిన పందికొక్కుల్లాగా ఎక్కడికక్కడ బదాబదలై నిలచిపోయినాయి. వాటిని నమ్ముకొని కూర్చున్న అమెరికాదేశం పాటన్ టాంకుల విచ్ఛిన్నంచూచి గ్రుడ్లప్పజెప్పింది. శాబర్‌జెట్ విమానాలను పిట్టల్లాగ రాలగొట్టారు.

ఇక పాకిస్థాన్‌ను రక్షించేవారు కనిపించలేదు. ఉభయులకు ఆమోదయోగ్యమయిన రాజీకి రష్యాదేశం తాష్కెంటు రమ్మని కోరింది వెంటనే మనశాస్త్రిజీ అన్నిపక్షాలవారిని కూడగట్టుకొని మీటింగుజరిపి వారందరి అనుమతితో రాజీకి తాష్కెంటుకు బైలుదేరడానికి నిశ్చయించుకొన్నారు.

# మృత్యుద్వారానికి పయనం

తాష్కెంట్ వెళ్ళడానికి మన ప్రధానితోపాటు విదేశాంగ మంత్రి శ్రీ స్వర్ణసింగ్, రక్షణమంత్రి శ్రీ చవాన్ యింకా మరి కొంతమంది సిబ్బందిని సమకూర్చుకొని 1966 జనవరి 3వ తేదీ ఉదయం ఢిల్లీలోని పాలం విమానాశ్రయంనుండి ప్రత్యేకవిమానంలో శాంతిని సాధించేనిమిత్తం బయలుదేరారు.

ఆ రోజు ఆ ధీశాలిని సాగనంపడానికి విమానాశ్రయమునకు సాయుధ ప్రభుత్వ ప్రధానాధికారులు, వేలాదిమంది ప్రజలువచ్చి ఘనమైన వీడ్కోలుయిచ్చారు. ఏ రోజూ గడపదాటిరాని వృద్ధురా లయిన తనతల్లి రామేదులారీదేవికూడ బిడ్డతోపాటు విమానాశ్ర యానికివచ్చి ఆఖరిక్షణములో బిడ్డను ఆప్యాయంగా నిమిరి, ముద్దిడి ఆశీర్వదించి, యుద్ధమనేది మన ఛాయలకే రాకుండా ఏర్పాటుచేసుకు రమ్మని బిడ్డను ప్రోత్సహించి దీవించి పంపింది.

మాతృమూర్తి ఆశీర్వచనములను, పెద్దల దీవెనలను, నల హాలను వెంటబెట్టుకొని మొత్తం భారతజాతి అండదండలనుకలిగి భారతమాత గౌరవం కాపాడేవిధంగా విజ్ఞతతో మెలిగి జయము సమకూర్చగలనని తన సహజ గంభీర వాక్కులతో సర్వప్రజల ఉత్తేజకరమైన నినాదాలతో 9-50 నిముషములకు పాలం విమా నాశ్రయమునుండి బైలుదేరి వెళ్ళారు.

పాకిస్థాన్ అధ్యక్షుడు అయూబ్‌ఖాన్ తాష్కెంట్ ఆ సాయంత్రానికే చేరుకొన్నారు. శాస్త్రిగారు విమానాశ్రయములో

దిగినప్పుడు రష్యా ప్రధాని కోసిగిన్ అపూర్వమయిన స్వాగత మిచ్చారు.

నాల్గవ తేదీ రష్యా ప్రధాని కోసిగిన్ సారధ్యంతో చర్చలు ప్రారంభమయినవి పలు విధ సమస్యలమీద చర్చ చాలాలోతుగా అంటే ఎనిమిది రోజులు జరిగింది. చివరకి అనుకొన్న ధ్యేయాన్ని సాధించారు. నాయకులిరువురు 'తాష్కెంటు సంయుక్త ప్రకటన'పై సంతకములుచేసి ప్రకటించారు.

ఆ ప్రకటన సర్వప్రపంచము విని ముగ్ధులైపోయారు. ఇట్టి శాంతి నిజమా? యని కొంతమంది నమ్మలేక పోయారు. భారత జాతి యావత్తు ఉప్పొంగి పోయింది. ఆనాడు సంతకములుచేసి విడుదల చేసిన ప్రకటన ప్రపంచములో సువర్ణాక్షరములతో లిఖించబడి వేనోళ్ళ ప్రస్తుతింప బడింది. ఆ ప్రకటనవినిన భారత జాతి గంభీరమైన స్వాగతమివ్వడానికి ఎంతో ఆశతో ఎదురుచూస్తూ ఉవ్విళ్ళూరింది.

పుత్ర రత్నముయొక్క కీర్తికాంతి దశదిశల ప్రకాశించి నందుకు తల్లి ఆనందానికి అంతులేదు. భర్త యొక్క మహోన్నత కీర్తికి లలితాదేవి పరవశురాలైంది.

కాని భారతీయులు దురదృష్టవంతులు. 11వ తేదీ తెల్ల వారకముందే పిడుగువంటి వార్త ఎల్లెడల ప్రాకిపోయింది. మానవ జాతి నిర్ఘాంతపోయింది. ప్రపంచమే గోడుగోడున విలపిస్తే ఇక యింటివారి విషయం వేరే చెప్పాలా? ఆ దుర్వార్త లలితాదేవి

చెవిని పడగానే మోయలేని దుఃఖభారంతో కృంగిపోయింది. ఈ ప్రపంచములో నాకేమీ మిగులలేదని శోకతప్తురాలై పోయింది. ధర్మమరణ సమయానికి దగ్గరై నాలేకపోతినని ఎంతగానో విలపించింది.

శాస్త్రీజీ మరణించారన్న వార్తవిని తాష్కెంట్‌లో వేరొక చోటనున్న రష్యా ప్రధాని శ్రీ కోసిగిన్ రక్షణమంత్రి మార్షల్ మాలినోవిస్కీ. విదేశాంగమంత్రి శ్రీ గ్రోమికో రెక్కలు కట్టుకొని అక్కడవాలారు. కాని ఏంలాభం అప్పటికే శాస్త్రీగారు శాశ్వతంగా కన్నుమూశారు.

ఒకరిద్దరుకాదు ప్రముఖులైన ఎనమండుగురు రష్యన్ డాక్టర్లు, శాస్త్రీగారి స్వంత డాక్టరు ఎంతగానో కృషిచేశారు. అసలు ప్రాణవాయువు ఎక్కలేదు, వారి కృషి బూడిదలోపోసిన పన్నీరైంది.

అంతకుముందే శాస్త్రీగారు రష్యా అధినేతలతో చతురోక్తులతో సరదాగా కాలంగడిపి పగటి పనికి అలసి రాత్రి విశ్రాంతి గైకొనడానికి ఎవరి నెలవులకు వారు వెళ్ళారు. అంత దుర్భర పరిస్థితిలోయున్న శాస్త్రీజీని కోసిగిన్ చూడలేక స్తంభించిపోయి, నోట మాట రాలేదు. ఏమీతోచక తలనువంచి ఆయన పాదములవద్ద నిలబడిపోయారు.

నగరమంతా అట్టుడికిపోయింది. హాహాకారాలు చెలరేగాయి. లక్షలాది తాష్కెంటు జనమంతావచ్చి తమ తుదిదర్శనం చేసు

కొన్నారు. పట్టణమంతా విషాదఛాయలు క్రమ్మాయి. "శాస్త్రీజీ అమర్ రహే" అనే నినాదాలు మార్మ్రోగాయి.

కొద్దిగంటలముందే ఢిల్లీలోఉన్న శ్రీమతి లలితాశాస్త్రితోను, పెద్దకుమారుడు హరితోను శ్రీ నందా ఫోన్‌లో మాట్లాడారు. రేడియోద్వారా ఈ దుర్వార్తవిన్న రేడియో అధికారి, వారి కుటుంబము నిర్ఘాంతపోయారు. పిడుగులాంటి యీ వార్తవిన్న లలితా శాస్త్రి నోటివెంట మాటరాలేదు. తల్లి మాత్రము నా కొడుకు చావ లేదు, నేను నమ్మనంటుంది, తొంబదేండ్ల తల్లి, అరువది సంవత్సరములు నిండని కొడుకు మరణవార్త ఎలా నమ్ముతుంది.

పిడుగువంటి ఈ వార్తవిన్న రాష్ట్రపతి డాక్టర్ రాధాక్రిష్ణన్ దేశప్రజల నుద్దేశించి ఈ వార్త చెప్పక తప్పలేదు. ఆయన శోకతప్తులై ఈ విధంగా తన బాధను వెలిబుచ్చారు

మన లాల్‌బహదూర్ ధృఢసంకల్పంగల జాతీయవాది. భారత్, పాకిస్థాన్‌ల మధ్యగల విభేదాలను తెగటార్చడానికి ప్రతినబూని తాష్కెంట్‌లో బలియైపోయారు. ఆయనయెడల కృతజ్ఞతతోనున్న భారతజాతి నేడు దుఃఖసాగరంలో మునిగిపోయింది.

క్లిష్టదశలోవున్న దేశాన్ని 19 మాసాల పరిపాలనాకాలంలో ప్రధానమంత్రిగానుండి ఎంతో శ్రమించారని, ఆయన ప్రజల మనిషని ఆఖరిక్షణంవరకు దేశసేవ కళ్యాణంకొరకు పాటుపడుతూ అశువులర్పించిన ప్రేమమూర్తియని, ప్రజల హృదయాలలో ఆయన శాశ్వతంగా నిలిచిపోగలరని అన్నారు.

ఆయన బ్రతికియుండగా రాబోవు జనవరి 26వతేదీ రిపబ్లిక్ రోజున తనకు అత్యున్నతమయిన "భారతరత్న" బిరుదు యివ్వ దలిచానని ఆయనతో పదేపదే చెప్పియున్నాను కాని యింతలోనే యింతటి దుర్ఘటన వాటిల్లినది; అయిననూ వారికి ఆ బిరుదునిచ్చి, సత్కరించి మన ఋణము తీర్చుకొనుట మన విధియని పెల్లుబికిన దుఃఖముతో సందేశమిచ్చారు.

## భౌతికకాయము ఢిల్లీ రాక

తాష్కెంటునుండి న్యూఢిల్లీకి శాస్త్రీజీ భౌతికకాయాన్ని తీసుకురావడానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయి. రష్యావారే ప్రత్యేక శకటాన్ని సిద్ధంచేశారు. శాస్త్రీజీ భౌతికకాయాన్ని ఎక్కించడానికి శ్రీ కోసిగిన్, శ్రీ ఆయూబ్‌ఖాన్, శ్రీ స్వరణ్‌సింగ్, శ్రీ చవాన్ ప్రభృతులు తమ చేతులమీదుగా విమానంలో ఉంచారు. కాని వారికి దుఃఖము ఆగక కన్నీటిబిందువులతో వారిముఖాలు వికలమయి పోయాయి.

శకటం విమానాశ్రయానికి బయలుదేరుచుండగా పదిలక్షల మంది తాష్కెంట్ ప్రజలు దారిపొడవునా బారులుదీర్చి, యిరువయిపులా నిలబడి విషణ్ణవదనాలతో, భారంతోనిండిన హృదయాలతో శ్రద్ధాంజలి ఘటించారు.

శాస్త్రీజీ భౌతికకాయం విమానంలో ఢిల్లీకి బయలుదేరు చుండగా శ్రీ కోసిగిన్, శ్రీ ఆయూబ్‌ఖాన్ తదితర ప్రముఖులు,

లక్షలాది ప్రజలు విషాద వదనాల,తో కన్నీటిధారలతో చూస్తూ నిలబడ్డారు.

ఇండియా పాకిస్థాన్ విభేదాలను శాంతియుతంగా చక్క దిద్దుకోవడానికి శాస్త్రీజీతో చర్చలు జరిపిన ఆయూబ్‌ఖాన్ విమానాశ్రయంలో తుదిసారి జోహార్లర్పించడానికి వచ్చినప్పుడు ఆ దృశ్యం అందరిని కదిలించివేసింది తాష్కెంట్ స్త్రీలు విమానం కదిలేటప్పుడు ప్రలాపించారు.

రష్యా ఉజ్బెకిస్తాన్ ప్రభుత్వాల తరుపున, అనేక సంస్థల తరుపున పుష్పగుచ్ఛాలతో నల్ల రిబన్నులతోను శాస్త్రీజీ భౌతిక కాయంకప్పబడింది.

భౌతికకాయాన్ని విమానం ఎక్కించేటప్పుడు విషాదగీతం ఆలపించబడింది. రష్యా సాయుధ సైనికులు తమ ఆయుధాలను తల్లక్రిందుగా ఉంచి నిలబడ్డారు. భారత జాతీయగీతం ఆలాపించబడింది.

తాష్కెంట్ నగరంలో అన్ని కార్యక్రమాలు స్తంభించి పోయాయి. నగరం యావత్తు అశ్రుపూరిత నయనాలతో నిండి పోయింది.

శాస్త్రీజీ భౌతికకాయం తాష్కెంటునుండి న్యూఢిల్లీకి జనవరి 11వ తేదీ ఉదయం 9-30 గం॥ బైలుదేరింది. అంతట సోవియెట్ నాయకులు మాట్లాడుతూ తాష్కెంట్ ప్రకటన "లాల్‌బహదూర్ స్మృతిచిహ్నం''గా ఉండిపోగలదని వచించారు.

తాష్కెంట్‌లో బయలుదేరిన రష్యా పుష్పకవిమానం శాస్త్రిగారి భౌతికకాయంతో పాకిస్థాన్ మీదుగా 1400 మైళ్ళు ప్రయాణం కొనసాగించి ఢిల్లీ పాలంవిమానాశ్రయంలో ఆ రోజు మధ్యాహ్నం గం. 2-31 నిముషాలకు దిగింది. ఆ మహనీయుని తుది దర్శనార్థం లక్షలాది జనం అశ్రుపూరిత నయనాలతో వేచియున్నవారు తీరని దుఃఖంతో జోహార్లర్పించారు.

విమానాశ్రయంలో శాస్త్రీజీ భౌతికకాయం కండ్లారా వీక్షించుట సాధ్యపడదని శాస్త్రిగారి అధికారనివాస భవనమయిన జనపథ్‌లోని పదవనెంబరు గృహందగ్గర కొన్నిలక్షలమంది ప్రజలు దారికాచారు.

విమానాశ్రయంలో పోలీసు బందోబస్తువలన దర్శన మందదని ఎరిగిన సామాన్య ప్రజానీకం తమ భక్త్యంజలి ఘటించడానికి కొన్ని కూడలిస్థలాలలో గుంపులుగుంపులుగా వేచియున్నారు. ఇక దారిపొడవునా పెద్దపెద్ద అంతస్థుల భవనాలనిండా జనం నిండిపోయి శోకిస్తూ, పుష్పాంజలులు సమర్పించారు. భౌతికకాయం వెళ్ళిన మార్గాలన్నీ పుష్పాలతో నిండిపోయాయి. నగరమే తన సహజ కళను కోల్పోయింది.

శాస్త్రీజీ భౌతికకాయాన్ని స్వీకరించేనిమిత్తం విమానాశ్రయానికి రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్, ఉపరాష్ట్రపతి డా॥ జాకీర్ హుస్సేన్, కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కామరాజు, కేంద్రప్రభుత్వ మంత్రులు శ్రీ వి కె. కృష్ణమీనన్, శ్రీ టి. టి. కృష్ణమాచారి, జమ్ము గవర్నర్ శ్రీ కరణ్‌సింగ్, కాశ్మీర్, ఉత్తరప్రదేశ్,

పంజాబురాష్ట్రాల ముఖ్యమంత్రులు, అధికారులు, అనధికారులు అనేకమంది హాజరయ్యారు.

విమానం 2-30 గంటలకు పాలం విమానాశ్రయంపై కనిపించగానే లక్షలాదిప్రజలు ఆర్తనాదాలతో ఘోష బోంతరాలు మారుమ్రోగాయి. విమానం క్రిందకు దిగగానే ప్రథమ పౌరుడైన రాష్ట్రపతి, తదితర పెద్దలు విమానంవద్దకు నడిచి వెళ్ళారు. ముందుగా విషాదవదనంతో విదేశాంగమంత్రి శ్రీ స్వరణ్‌సింగ్ విమానంనుండి వెలుపలికి వచ్చారు. తదుపరి శ్రీ చవాన్ యిద్దరు సోవియట్ ప్రముఖులు, భారతీయ ప్రతినిధి వర్గసభ్యులు బయటకు వచ్చారు.

త్రివిధ సైనికదళాలకు చెందిన అరుగురు సైనికులు మృత దేహాన్ని బైటకు తీయడానికి విమానంలో ప్రవేశించారు. భరింపరాని దుఃఖముతో శాస్త్రిగారి పెద్దకుమారుడు శ్రీ చావన్‌గారి చేయూతతో విమానంలో ప్రవేశించారు. ఆ రోదన ఆ ఆక్రందన మనం సహించలేము.

ఆతేజోమూర్తి అకాలమరణానికి తన్నుతాను నమ్మలేక హరికిషన్ ఆ భయంకర దృశ్యం చూచి మూర్ఛపడిపోయాడు.

కన్నీటి మడుగులో ఆ విమానాశ్రయం నుండి మృతదేహానికి కప్పబడిన త్రివర్ణ పతాకంతోనే ఇల్యూషన్ విమానంనుండి బయటకు తీసుకువస్తున్న దృశ్యము హృదయ విదారకంగా ఉంది.

అశ్రుబిందువులతో అందరికళ్లు చీకట్లు క్రమ్మాయి. ప్రతిఒక్కరూ కళ్లుతుడుచుకొని దారిచేసుకోవలసి వచ్చింది.

శవపేటికకు ప్రధానవాహకులుగా నియమింపబడిన త్రివిధ బలాల సేనానులు శవపేటిక ననుసరించారు. భౌతికకాయం విమానాశ్రయంనుండి జనపథ్‌కు బైలుదేరునప్పుడు రాజస్థాన్ రైఫిల్ దళమునకుచెందిన బ్యాండుదళం విషాదస్వరంతో విషాదగీతిక నాలపించగా గుండెలు ద్రవించినవి. అరగంట తరువాత విమానాశ్రయం నుండి శకటం బయలుదేరింది. ఇక పుష్పవర్షానికి హద్దులేదు. గంటలసేపు పుష్పవర్షం కురిసింది.

కన్నుమూసిన శాస్త్రీజీ ముఖం ప్రశాంతముగా ఉంది. 'గాంధిటోపి' తన స్థానం తప్పనేలేదు. శాస్త్రిగారి అధికార గృహానికి సాయంకాలం 4-10 గంటలకు శాస్త్రిగారి భౌతికకాయం చేరుకొంది. ఇంటికి చేరగానే భౌతికకాయాన్ని లోపలికి తీసికొని వెళ్ళారు. పుట్టెడు దుఃఖంతో ఉన్న వృద్ధమాత రామదులారీదేవి కుర్చీలోనుండి లేవలేక పోయింది.

భర్తశవం ఇంటిలోనికి వచ్చిందని తెలియగానే అమాంతం లలితాదేవి భౌతికకాయం దగ్గరకు వచ్చి తడబడి వణికిపోతూ శాస్త్రీజీ బుగ్గలు నిమిరి భోరుమంటూ ప్రలాపిస్తూ వారి పాదాలపై తన నుదురునుంచి అల్లాడిపోయింది. అక్కడనుండి విదేశనాయకులు, ప్రజలు ధారావాహికంగా వచ్చి భౌతికకాయాన్ని దర్శించి పుష్పగుచ్ఛాలను సమర్పించారు.

# అంత్యక్రియల ఏర్పాటు

శాస్త్రీజీ భౌతికకాయానికి సకల రాజ లాంఛనాలతో అంత్యక్రియలు జరపడానికి ప్రభుత్వం నిర్ణయించింది, ప్రపంచ రాజ్యాధినేతలంతా అంత్యక్రియలలో పాల్గొనడానికి ఎడాతెరిపిలేకుండా ఢిల్లీ చేరుకొంటున్నారు. రష్యాదేశం తరుపున శ్రీ కోసిగిన్ శ్రద్ధాంజలి సమర్పించడానికి స్వయంగా ఢిల్లీ చేరుకొన్నారు.

బ్రిటన్ నుండి ఆ ప్రభుత్వము తరుపున బ్రిటన్ ఉపప్రధాని శ్రీ జార్జిబ్రౌన్, ఎలిజబెత్‌రాణిగారి బదులుగా శ్రీ లార్డుమౌంట్ బాటెన్, బ్రిటన్ ప్రతిపక్షం తరుపున దాని ప్రతిపక్ష నాయకుడు శ్రీ ఎడ్వర్డ్‌హీత్ ఇంకా పధ్నాలుగుమంది సభ్యులు విచ్చేశారు.

అమెరికా ప్రతినిధిగా అమెరికా ఉపాధ్యక్షులు శ్రీ హ్యూబర్టు హంఫ్రీ, విదేశాంగ మంత్రి శ్రీ డీన్‌రస్క్ ప్రభృతులు హాజరయ్యారు.

చెకోస్లోవేకియా నుండి ఇవాన్, రోహర్, మిచ్‌క్లీవ్ జపాన్, తాయిలాండ్, లావోస్ దేశముల నుండి ఆ యా ప్రతినిధులు, సింగపూర్ తరుపున విద్యామంత్రియైన శ్రీ ఆంగ్‌పాంగ్ బూన్, బర్మానుండి తమ విదేశాంగమంత్రి ఊథాహాన్, ఫ్రెంచ్ దేశమునుండి ప్రెసిడెంట్ శ్రీ డీగోల్, ప్రత్యేకదూత లూయాస్ జాక్, మొరాకోరాజు ప్రతినిధి శ్రీ బాలాఫ్రెచ్, యుగోస్లావియా వైస్‌ప్రెసిడెంట్ శ్రీ బ్లాక్‌పక్, ఇరాన్ నుండి ఆ దేశ విదేశాంగ

మంత్రి శ్రీ ఆరామ్, యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ నుండి వైస్ ప్రెసిడెంట్ శ్రీ హుస్సేన్ఎల్షాఫి, పశ్చిమజర్మనీ నుండి ఆర్థిక సహకార శాఖామాత్యులు డాక్టర్ వాల్టర్షిప్, భూటాన్ రారాజు ప్రతినిధిగా వారి ప్రభుత్వపు కార్యదర్శి, ఫిలిప్పీన్సు తరుపున ఆ ప్రెసిడెంటు బావమరిది, జోర్డాన్ రాయబారి శ్రీ కమాల్హావకర్, కామన్వెల్తు సెక్రెటరియెట్ ప్రతినిధి శ్రీ ఎల్. వి. సేన్ గుప్తా, పాకిస్తాన్ తరుపున వాణిజ్య మంత్రి గులాంఫరూక్, ఆప్ఘనిస్థాన్ ప్రధానిమైన శ్రీ ద్వాల్, నేపాల్ మంత్రిమండలి అధ్యక్షులు శ్రీ సూర్యబహదూర్ధాపా, ఐక్యరాజ్యసమితి తరుపున శ్రీ సి. వి. నరసింహన్, చైనా తరుపున వారి రౌత్యప్రతినిధి హాజరైనారు.

## అంత్యక్రియలకు ప్రముఖుల రాక

విదేశాలనుండి హాజరైన ప్రతినిధివర్గాలవారు తదితరులు సుమారు 5 లక్షలమంది ప్రజానీకం పుష్పగుచ్ఛాలు సమర్పించి తమ అంతిమదర్శనం చేసుకొన్నారు. తదనంతరం గం. 9-30 ని. లకు అంత్యక్రియలనిమిత్తం జనపథ్నుండి ఊరేగింపు బయలుదేర దీశారు. మతసంబంధమయిన కార్యక్రమము ముగిసినపిదప వారి కుటుంబముయావత్తూ దుఃఖసాగరంలో మునిగిపోయింది.

శ్రీమతి లలితాశాస్త్రి తుదిసారిగా భర్త పాదాలకు నమస్కరించి, కుప్పకూలిపోయింది. తదుపరి సాయుధదళాలలోని మూడు విభాగాలవారు త్రివర్ణపతాకం కప్పిన మృతదేహాన్ని నెమ్మదిగా తీసికొనివెళ్ళి శకటంపై ఉంచారు.

సైనికులు తమ ఆయుధాలను తల్లక్రిందులువేసి విచారవందనం చేశారు. శకటం నెమ్మదిగా కదిలింది. కట్టలుతెంచుకొని వచ్చే దుఃఖముతో ఇక శాస్త్రిగారు తనకులేరను ఆవేదనతో కృంగిపోయిన లలితాశాస్త్రిగారు లేని బలాన్ని తెచ్చుకొని, ప్రధానద్వారం వరకు వచ్చి ఆగిపోయింది.

ఆ పుణ్యాత్మునితో ఎన్ని కష్టాలు, ఎన్ని అవాంతరాలు ఎదుర్కొని సుఖంగా, ఆనందంగా గడుపుకొన్నదో ఆ 50 సంవత్సరాల స్నేహం మంటగలిసిపోయిందని ఎంతగానో ప్రలాపించింది. దేవుడు వారి యిరువురికీ శాశ్వతమయిన ఎడబాటు కల్పించాడు. ఆమె దుస్థితినిచూచి అందరూ దేవుడు దయలేనివాడని ఆయన నిర్దయుని ఎంతగానో నిందించారు.

ప్రజలు లక్షలు లక్షలుగాచేరుకొన్నారు. శాస్త్రిగారుఉన్న శకటంపై నలుగురు కుమారులు, యిద్దరు అల్లుళ్లు భౌతికకాయం ప్రక్కగా కూర్చున్నారు.

త్రివిధబలాల అధిపతులు, జనరల్ శ్రీ దేవిడ్ చౌదరి; వైస్ అడ్మిరల్ శ్రీ బి. ఎస్. సోమన్, ఎయిర్‌మార్షల్ శ్రీ అర్జున్ సింగ్ ఈ కార్యక్రమమునకు అధిపతులుగా ఉన్నారు. దారిపొడవునా సైనికులు, **N. C. C.**, పోలీసుదళాలు విచారవదనాలతో ముందు దారితీస్తున్నాయి.

ఊరేగింపులోపాల్గొన్న సైనిక పటాలానికి రాజస్థాన్, ఢిల్లీ ప్రాంతం జనరల్ కమాండింగ్ ఆఫీసర్ శ్రీ జి. ఆర్. రాజువాధే నాయకత్వం వహించారు. సాయుధశకటానికి వెనుకనుండి శాస్త్రి గారి కుటుంబసభ్యులు, దేశ, విదేశప్రముఖులు, లక్షలాది జనము చీమలతోరణమువలె సాగారు.

రాజపథ్‌లోనికి భౌతికకాయమున్న శకటము ప్రవేశించి నప్పుడు తమ ప్రియతమనాయకుని అంతిమదర్శనంకోసం వేలాది ప్రజలు ముందుకు త్రోసికొని వచ్చారు. న్యాయంగా చూడాలన్న బలహీనులు ఆ జనంలోనిలిచి తట్టుకోలేరు. అయినా చూడాలన్న ఆసక్తి ప్రజల్లో తగ్గుతుందా ? ప్రజలంతా ఒకరొకరుగా పుష్ప గుచ్ఛాల్ని శకటంపై ఉంచి. శోకతప్తులై, వినయంగా తలలువంచి కన్నీటిబిందువులతో జోహారులర్పించారు. బాపూజీకి ప్రీతిపాత్ర మైన 'రఘుపతి రాఘవ' గీతాన్ని ఆలపించారు.

"లాల్‌బహదూర్ అమర్‌రహే" "భారత్‌కానాయక్ అమర్ రహే" అనే నినాదాలతో ఢిల్లీ నగరం మారుమ్రోగింది. 10 గం. ఊరేగింపు నెమ్మదిగా ఇండియాగేటు చేరుకొంది. అక్కడ పుష్ప వర్షం కురిపించారు ప్రజలు.

సాయుధ శకటాన్ని అనుసరించి విదేశ అగ్రనాయకుల కార్లు నడవసాగాయి. అందు అమెరికా వైస్‌ప్రెసిడెంటు శ్రీ హ్యూబర్టు హంఫ్రీ యిత్యాది ప్రముఖులున్నారు. ఊరేగింపు ఇండియాగేటునుండి కానాట్ ప్రాంతానికి సాగింది. ఇక పోలీసు బలగం అదుపు చేయలేకపోయింది.

ఊరేగింపుజరిగి దాదాపు పదిన్నర గంటలకు కానాట్ ప్రాంతం చేరింది ఆ శకటం. అదిమంచి వ్యాపారకేంద్రము. అక్కడ భవనాల మీద వేచిఉన్న జనసందోహం "శాస్త్రీజీ అమరుడవయ్యావా? మాకికలేవా!!'' అని కన్నీటితో పూలవర్షం కురిపించారు.

అ విధంగా సాయుధశకటం చల్లగా తిలక్ వంతెనదాటి ఇంద్రప్రస్థరోడ్డు చేరుకొన్నది. అక్కడ చెట్లమీద ప్రాణాలనుకూడా లెక్కచేయకుండ క్రిక్కిరిసిఎక్కిన ప్రజలు పుష్పవర్షంకురిపించారు. తిలక్‌బ్రిడ్జి రైల్వేస్టేషన్‌వద్ద రైలు ప్రయాణీకులు తమప్రియతమ నాయకుని అంతిమ దర్శనార్థం రైలుబండినికూడా ఆపి శ్రద్ధాంజలి ఘటించారు. రింగ్‌రోడ్ నుండి దహనసంస్కారం జరిగే స్థలంవరకు ప్రజలు క్రిక్కిరిసి ఉన్నారు. శకటం చేరువ అయ్యేకొందీ ''శాంతిదూత అమర్‌రహే" అనే నినాదాలు మారుమోగాయి

శాంతివనంఎదుట జనం విపరీతంగాఉంది. ఈ ఊరేగింపు దాదాపు గం. 8-30 ని. లు పట్టింది. వాతావరణం చాలా చల్లగా ఉంది. దహనసంస్కారం జరిగేచోటుకు సాయుధశకటం సరిగ్గా గం. 11-55 ని.లకు చేరుకొంది. బాపూజీ శాంతిఘాట్‌కీ, నెహ్రూజీ శాంతివనానికి ప్రక్కనే ఏర్పాటుచేయబడినది.

ఆ ప్రదేశం శకటానికి నూటయాబదిగజము లుండనగా ఆపి, సీనియర్ ఉద్యోగులైన మిలటరీ ఆఫీసర్లు శాస్త్రీజీ భౌతిక కాయాన్ని శకటమునుండి విచారవదనములతో మోసుకుంటూ దహనవేదికవద్దకు తీసుకువెళ్ళారు.

సరిగ్గా గం. 12-12 ని. లకు ఆ పుణ్యమూర్తి భౌతిక కాయాన్ని చితిపై భద్రపరచి, జోహార్లు అర్పించి వినయంగా నిలబడ్డారు.

విదేశ ప్రముఖుల కోసం ప్రత్యేకంగా ఆ ప్రదేశం చుట్టు ప్రక్కలా షామియానాలు ఏర్పాటు చేయబడగా ప్రముఖులంతా దానిక్రింద ఆసీనులైయున్నారు. మన రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, తాత్కాలిక ప్రధాని శ్రీ నందా, కేంద్రమంత్రులు, వివిధ రాష్ట్రనాయకులు, అధికారులు లక్షలాది ప్రజలు హాజరైనారు.

ఇక ఆ దృశ్యము చూచిన లక్షలాది జనుల రోదనతో ఢిల్లీ పట్టణమంతా మూలిగింది. లక్షలాది ప్రజలంతా కన్నీరు కారుస్తుండగా శాస్త్రీజీ పెద్దకుమారుడు హరికిషన్ మంచిగంధపు చెక్కలతో పేర్చిన చితికి వేదోక్త సమయములో నిప్పంటించారు. అంతటితో శాస్త్రీజీ భౌతికశరీరం పంచభూతాలలో కలసిపోయింది.

సత్యం, ధర్మం, సహనం కల్గిన మహానుభావుడైన శాస్త్రీజీ మనకికలేరు. ఆయన త్యాగనిరతికి, సహనశీలానికి, స్నేహతత్పరతకు, శాంతి స్వభావానికివే జోహారులు.

-: సంపూర్ణము :-